# నవజీవనం

( అవతార్ మెహెర్‌బాబా నవజీవన ఘట్టం )

## ద్వితీయ భాగం

: సంకలనం :

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు




అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు

మచిలీపట్నం

# NAVAJEEVANAM
**( Second Part )**

Compiled by
G. V. G. K. CHANDRAMOULESWARA RAO
29-36-12 Museum Road
VIJAYAWADA - 520 002

First Edition : 31st January 1984

Copies : 1000

PRICE: Rs. 7-00

Title Design by
Dr. G. V. PURNACHAND, B. A., M. S.,

Sole Distributors :-
KEERTHI PUBLICATIONS
Eluru Road, VIJAYAWADA - 2

Printed at




2

# ముందుమాట

శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావుగారు రచించిన అవతార్ మెహెర్‌బాబా వారి ‘ నవజీవనం ’ ప్రథమ భాగము నేను జాగ్రత్తగా చదివి ఎంతో ఆనందించితినని తెలుపుటకు సంతసించుచుంటిని. వారు మిగుల శ్రమతో, బాబా తన శిష్యులతో గడిపిన అనేక అమూల్యమైన సంఘటనలను జాగ్రత్తగా సేకరించి, మధురమైన తేట తెలుగులో, వ్యావహారిక భాషలో, పాండిత్య ప్రకర్షకులోనుగాక, రచనచేసి, ఆంధ్రలోని బాబా ప్రేమికులకు, సామాన్య ప్రజలకు అందించి, గొప్ప సేవ చేసిరి. వారి హృదయములో బాబాయే వుండి, ఆయనను పనిముట్టుగా ఉపయోగించి, తన కార్యమును నిర్వర్తించినట్లు మనము గ్రహించి ఆనందింతము గాక !

బాబా శిష్యుల కిచ్చిన శిక్షణ, మన అందరికి ఆదర్శమే అగును. మనము ప్రకృతి ఆకర్షణలకు బానిసలై బలహీనత, అధైర్యము కలిగి, క్రుంగుచున్నందున, బాబా తన అపారప్రేమతో, మౌన దీక్షలో, మన నిజస్వరూపమైన ఆత్మను మేల్కొలిపి, మనలను ధైర్య సాహసములు గల ధీరులుగా ప్రకృతికి నాధులుగాను, దైవస్వరూపులుగాను మార్చి, మన జీవితపు దివ్య గమ్యమును తెలిపి వుద్ధరించిరి. మనము చివరి వరకు ఆయన కొంగు వీడకుండ, విశ్వ సోదర భావమును నెలకొల్పుటకు, ఆయన కార్యక్రమములలో పాల్గొందుము గాక ! !

సోదరుడు చంద్రమౌళీశ్వరరావు సంకలనాలన్నిటినీ ప్రచురించుటలో హృదయ పూర్వకముగా తోడ్పడుతున్న ప్రముఖ బాబా ప్రేమిక సోదరుడు, దయార్ద్ర హృదయుడు మచిలీపట్నం సెంటరు ప్రథమ కార్యదర్శి, ప్రస్తుత అధ్యక్షుడు అయిన శ్రీ తాడేపల్లి బసవయ్యగారికి, మా చిన్న చల్లపల్లి సెంటరు అభివృద్ధికి పెక్కు విధముల సహకరించినందులకు నా కృతజ్ఞతాభివందనము లర్పిస్తూ, సకలాంధ్ర బాబా ప్రేమికలోకం యీ సంకలనం చదివి, ప్రియతముని ప్రేమాశీస్సులు పొందుదురు గాక ! ! !

విజయవాడ  ఇట్లు

31 - 1 - 1984  భట్టిప్రోలు వెంకట రమణారావు

# నమస్సుమాంజలి

భగవంతుడు, యీ సకల సృష్టి తన బిడ్డలైనందున, తగు జాగ్రత్తతో పెంచి పోషించి, సరియగు మార్గంలో రక్షణ కల్పించుటకే తనకున్న అపార దయ, కరుణల వలన, మళ్ళీ, మళ్ళీ మానవాళి మధ్యకు మానవుడై వస్తాడు.

ఈ యుగంలో మన అదృష్ట వశమున, కలియుగ అవతారుడుగా అవతార్ మెహెర్‌బాబా అవతరించటం, ఆయనకు మనమంతా సమకాలికులమై ఆయన కొంగు బంగరు భాగ్యం పట్టుకొను అదృష్టము లభించినందుకు మనమెంతో ధన్యులం. బాబా యొక్క జీవిత విశేషాలెన్నో సాకల్యంగా వ్రాయబడి వుండుటేకాక, యింకా సజీవులుగావున్న బాబా అనుంగు శిష్యుల అనుభవ పరంపరతో, బాబా స్వయంగా అందించిన అనేక గ్రంథాలు, నేటి తరమునకే కాక, భావితరాల వారికి, ఆధ్యాత్మిక సంపదగా వుండేటట్లు అందివ్వబడినవి.

అవతారుని చరిత్ర వ్రాయాలంటే ఎన్ని వేల పేజీలైనా వ్రాయవచ్చును. కానీ, ప్రేమికులకు సులువుగా బోధపడే రీతిలో బాబా నవజీవన కాలంలో జరిపిన బాహ్య కార్యక్రమాల గురించి, అనేక విధాల సేకరించిన విషయములను వరుస క్రమంలో క్లుప్తంగా వివరించుటకు యిందులో ప్రయత్నించాను.

ఈ నవజీవనం అనేది, బాబా కార్యక్రమ విధానంలో 1949 అక్టోబరు 16 నుండి 1952 ఫిబ్రవరి వరకు జరిగిన ఒక క్రొత్త ఘట్టం. ఈ జీవనాన్ని బాబాయే "నవజీవనం" అని పిలిచారు. నవజీవన కాలంలో జరిగిన కష్టాలు, బాధలు, నిస్సహాయ నిరాశామయ జీవనం అలవడుటకై, తనకు తానే స్వయంగా సృష్టించుకున్న ఘట్టం.

సర్వమూ త్యజించి, భగవంతునికి సమర్పణ గావించుకొని, ఆయన సహాయముపై ఆధారపడుట వారి కలవాటు అగుటకు, తానే అట్టి జీవితం

గడిపారు. ఈ కాలంలో బాబా ఒక ఆధ్యాత్మిక గురువుగా నడిచినా, సఖునిగా వ్యవహరించారు. కాలి నడకన, భిక్షుక వృత్తితో, ఎట్టి ఆచ్ఛాదన లేకుండా, రోడ్డు ప్రక్కనో, తోటలలోనో విడిదిచేస్తూ, చేతిలో ఒక్క పైసా కూడ లేకపోయినా నిన్న గడిచినట్లే నేడు గడిచింది. మరి, రేపు గురించి, చింతెవరికి ? రేపు కూడ గడిచిపోతుందిలే ! అనే నమ్మకంతో శిష్యులంతా దిన భత్యానికి కావలసిన నిత్యావసర వస్తువులేమి లేకున్నా, కేవలం బాబాపై భారంతో ఆయనను అనుసరించారు.

బెనారసులో ప్రారంభించి, అనేక ఘట్టాల నెదుర్కొని బాబా తన బృందంతో సతారా చేరేసరికి నవజీవనం ఒక సంవత్సరం పూర్తయింది. ఈ కాలంలో జరిగిన ముఖ్యమైన విషయాలన్నీ యీ రెండవ భాగంలో వివరించబడినవి. యింతకు ముందు రచనల వలెనే, ఈ రెండవ భాగాన్ని కూడ, అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు వారు ప్రచురించినందుకు వారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

నవజీవనం మొదటి భాగంపై తమ అమూల్య అభిప్రాయాలు పంపి, ప్రోత్సహించిన వారందరికి నా కృతజ్ఞతాభి నందనము లర్పిస్తున్నాను. 15 వ అమర తిథి సందర్భంలో బాబా దివ్య సమాధి చెంత, ఆవిష్క-రించాలనే తలంపుతో, త్వరితంగా అచ్చొత్తించాలని ప్రయత్నించగా, ఎన్ని వత్తిడి పనులున్నా, స్పందన ప్రింటర్సు మచిలీపట్నం వారు అనతికాలంలో గ్రంథ రూపంలో అందించినందుకు వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ రెండవ భాగం సర్వాంగ సుందరంగా టైటిలు పేజీతో వెలువడుటకు చేయూత నిచ్చిన, మచిలీపట్నం అవతార్ మెహెర్‌బాబా సెంటరు కార్యదర్శి, శ్రీ కన్యకాపరమేశ్వరి రైస్‌మిల్లు కాంట్రాక్టర్స్ కంపెనీ మేనేజింగు పార్టనర్ అయిన శ్రీ గుడివాడ రామచంద్రరావుగారికి నా హృదయపూర్వక అభివాదములు.

జై బాబా !

విజయవాడ — బాబా సేవలో

31 - 1 - 1984 — బి. వి. బి. కె. చంద్రమౌళీశ్వరరావు

∽

# తొలి పలుకు

జై బాబా !

సోదరుడు శ్రీ చంద్రమౌళీశ్వరరావు సంకలనం చేసిన 'నవజీవనం' రెండవ భాగమునకు కూడా తొలిపలుకు వ్రాసే అవకాశం నాకు లభించుట బాబా కృపా విశేషము.

నవజీవన ప్రాశస్త్యము అవగాహనకు అందనిది. నవ యవ్వనము, నవయుగము మున్నగు పదములలోని " నవ " శబ్దము అభివృద్ధిని, ఔన్నత్యాన్ని సూచించును. కానీ 'నవ జీవనము'లో బాబా కోరి కష్టాలను వరించారు. కష్టాలను ఆనందంగా ఆహ్వానించి, అతిక్రమించి, వాటి నిర్వీర్యతను, అనుభూతి పొందుటలో విజయం సాధించుటే జీవిత గమ్యం. లక్షలాది రూపాయలు చేతులతో, నిస్వార్థత, సేవాపరాయణత్వంలో త్యాగం చేసిన బాబా, తన నిమిత్తం, తృణీకరించి, కటిక బీదరికాన్ని దేవతలు సైతము అసూయపడే రీతిగా, తన అనుచరులతో సహా ఆచరించి, ఆదర్శ మార్గాన్ని చూపారు.

శరీరమే తాను అనుకొని, భోగలాలస జీవనం గడిపే మానవాళి అజ్ఞానాన్ని, అట్టి నడవడికతో పటాపంచలు చేశారు. యీ నవజీవనంలో జరిగిన ప్రతి చిన్న విషయము లోతు తెలుసుకున్న కొద్దీ ఎంతో ప్రాధాన్యత గలదియై భగవత్ చర్యగా గోచరించును. ఆ కార్యక్రమములో పాల్గొన్న అనుచరులు,

ఎంత సామాన్యులైనా, గొప్ప ఆధ్యాత్మిక ప్రతిభావంతులుగా హృదయ పరిణామము పొందినారనుట నిస్సందేహము.

జీవితము శోభాయమానముగా ఆనందంతో, చీకు చింతలకు తావీయక ఎన్ని కష్ట నష్టములైనా చిరునవ్వుతో స్వీకరించి ఆచరించి చూపిందే యీ నవజీవనం. చదువరులు పైకి కనిపించే విషయము మాత్రమేగాక, అంతర్గతముగావున్న సారాంశమును స్వీకరించగలరని ఆశించుచున్నాను.

ప్రత్యక్ష అవతార పురుషుడు, దైవమానవుడు, మానవాళికి తన కృపా విశేషముచే యిచ్చిన మహా ప్రసాదమే యీ నవజీవన విధానము. చదవండి! తిరిగి చదవండి!! అవరోధముల అసమర్థతను తెలుసుకోండి. వాటిని అధిగమించండి. మీ జీవితమే మహా భాగ్యము, వరప్రసాదము, సచ్చిదానందము కాగలదు.

ఈ రచనలో విశేష కృషిచేసి, శులభ శైలిలో మానవాళి తరించుటకు శ్రీ చంద్రమౌళీశ్వరరావు చేసిన అద్భుత సేవ బాబా కృపా విశేషమనుట నిస్సందేహము. ప్రోత్సహించుట మన బాధ్యత.

ఇట్లు

31–1–1984 తాడేపల్లి బసవయ్య

అధ్యక్షుడు

అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు



# గ్రంథావిష్కరణ సభ



ది. 24–7–1983 న చల్లపల్లిలో జరిగిన " నవజీవనం " ప్రథమ భాగం గ్రంథావిష్కరణ సభలో పాల్గొన్న ముఖ్యుల్లో సోదరులు సర్వశ్రీ తాడేపల్లి బసవయ్య ; పింగళి దుర్గాప్రసాదరావు ; డి. కృష్ణయ్యర్; చింతా సర్వారావు; వై. మాణిక్యాలరావు గారలు; ఆవిష్కర్త శ్రీ బి. హెచ్. వి. రమణరావు శ్రీ కె. రామమోహన రావు తదితరులతో రచయిత శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు.



జై బాబా!

# వైవిధ్యం-సొగసు

నవజీవనంలో రెండవ ఘట్టం పవిత్ర గంగాతీరం బెనారసులో ఆరంభమైంది. బాబా బృందంతో నాతిఇళ్ళులో మకాంచేశారు. ఈ కాశీక్షేత్ర మహాత్మ్యం గురించి ముందుగా కొంచెం తెలుసుకుందాం.

ఒకప్పుడు కొందరు పాశ్చాత్య ప్రేమికులు 'లక్షలాది హిందువులు బెనారసులో నిర్మించిన విగ్రహాలు, దేవాలయాలకు యిస్తున్న మతపరమైన ప్రాముఖ్యం వెనుక ఏదైనా ఆధ్యాత్మిక విశేషం వున్నదా?' అని బాబాను ప్రశ్నించారు. అందుకు బాబా యీవిధంగా వివరణ యిచ్చారు. "అనాదికాలంనుండి లెక్కకు మించిన ఎందరో ఋషులు, తాపసులు, మునులు సంవత్సరాల తరబడి కాశీక్షేత్రం పరిసరాలలో నివశించారు. ధ్యానసమాధిలో వుండేవారు. తపస్సు నాచరించారు. ఉన్నత సమాధి అవస్థలో గడిపారు.

అత్యున్నత ఆత్మలగు రాముడు, కృష్ణుడు, బుద్ధుడు తుదకు జీససుక్రీస్తు సహితము వారి జీవితకాలంలో కొంత సమయం యిక్కడ గడిపారు. మరి యింతటి వున్నత పరిణతి

చెందిన ఆత్మలు, సద్గురువులు ఆ యా కాలాలలో యిక్కడ వుండుటచేత, వారి ప్రభావంతో యీ ప్రదేశం ఆధ్యాత్మిక వాతావరణంతో ప్రదీపితం గావింపబడింది.

యదార్థమైన పవిత్రత అక్కడున్న జీవంలేని గోడల్లోను, రాళ్ళల్లోను, యిటుకలలోను లేదు. ప్రక్కన ప్రవహించే గంగాజలంలోనూ లేదు. అయితే అనేక సద్గురువులు, పరిపూర్ణ ఆత్మలు వారివారి కాలాల్లో యిక్కడవుండి, తమ ఆధ్యాత్మిక సౌరభాన్ని, ప్రేమ, భక్తి, ధ్యానం అనే అగ్నిద్వారా నలుదిశల వెదజల్లి, ఆధ్యాత్మికశక్తులను విడుదల జేయుటవలన ఈకాశీక్షేత్రం మహాపుణ్యక్షేత్రమైంది" అన్నారు.

అటువంటి కాశీక్షేత్రంలో బాబా బృందం విడిదికొరకు ఏర్పాటుచేసిన సాతిఇమ్లీభవనంగురించి యింతకుముందు వివరముగా తెలుసుకున్నాం. అది ఒక బ్రహ్మాండమైన భవంతి. అందులో బాబాకొరకు ఒక ప్రత్యేక అతిధిగృహ మున్నది. మహిళలకు ప్రత్యేకగదులున్నవి. మిత్రులందరికీ ప్రత్యేకగదులున్నాయి. సేవకులకు వేరే యిళ్ళున్నాయి. వంటకు విడిగా గదులున్నాయి. చుట్టూ తోట, పూలవనం, ఫౌన్‌టెన్‌లుతో చదు శోభాయమానంగా వున్నది. వీటన్నిటినీ చుట్టి బ్రహ్మాండమైన ప్రహరీగోడ. మధ్యగా ప్రధానద్వారం, దానికోతాళం. ఇదీ బాబా విడిదిచేసిన భవనంయొక్క వివరణ. అది ఎంతో రమణీయంగా వుండి చూడముచ్చటగా వుండేది.

# ప్రియతముని భిక్షాటన

నేనింతకుముందే చెప్పినట్లు, ఆనాటివుదయం బృందమంతా తమతమ సామాన్లు లాగుడుబండిపై వేసుకొని నాచీబాగ్ చేరారు. బాబా మహిళలతో డా॥ నాథ్‌గారి కారులో భవనం చేరుకున్నారు. బృందమంతా ఆనాడు తమ అల్పాహారం మరిచేపోయారు.

అయితే భోజనంవేళకు ఎవరో గేటువద్దకు వచ్చి గేటును తట్టారు. అలికిడివిన్న యీరుచ్ వెళ్ళిచూడగా సేవకుడొకరు, డా॥ నాథ్‌గారు పంపగా వచ్చివున్నాడు. వంట తయారై సిద్ధంగా వున్నదని, పంపమంటే వెంటనేపోయి తెస్తానని చెప్పాడు. యీరుచ్ బాబా చెంతకువెళ్ళి అనుమతికోరాడు.

అందుకు బాబా, వారి నేమీ పంపవద్దని చెప్పమన్నారు. తా నారోజు స్వయంగా కాశీమహానగరంలో భిక్ష నర్థించదలచా నన్నారు. బృందంలోని తక్కిన మిత్రులకు కూడ ఏమీ పంప వద్దని చెప్పమన్నారు. ముఖ్యంగా ఆరోజున బాబా బృంద నాయకుడుగా ప్రిప్రిథమంగా తమ ఆహారాన్ని డా॥ నాథ్‌గారి యింటివద్ద స్వయంగా భిక్ష కోర సంకల్పించినట్లు తెలుపమని కబురంపమన్నారు.

కబురందుకున్న డా॥ నాథ్ ఎంతో సంతోషించాడు. కానీ పాపం, వారింటి కానాడు అలావచ్చి యాచించేవారు ఎవరో ఎరుగరై రి. కేవలం యిరువురు మిత్రులు, ఆనాడు వారింటికి భిక్షకొరకు వచ్చి యాచింతురనిమాత్రం తెలియపరచబడినది.

బృందంలోని ఇరువురు మిత్రులు, తమయింటికి భిక్షకొరకు వస్తున్నట్లు వచ్చిన వార్తను, డా॥ నాథ్ దంపతులు డా॥ ఖేర్‌కు కూడ తెలిపారు. యీ బృందమెవరో తెలుసుకోవాలనుకున్న డా॥ ఖేర్ యీవార్తవిని, ఆ వచ్చేవారిద్వారానైనా వారి సమాచారం కొంతవరకు తెలుసుకొన వీలగునని తలచాడు.

ఈవిధంగా కాశీలోవున్న రోజులలో, ప్రిప్రథమంగా బాబా ఈరుచ్‌తోకలిసి భిక్షాటన చేయుట తటస్థించినది. ఆనాడు బాబా నవజీవనం దుస్తులు తెల్లగౌను, పచ్చ తలపాగా, తెల్ల బూట్లు, చంకన జోలె, చేతిలో అక్షయపాత్ర (ఇత్తడి క్యారేజి) ధరించారు. ప్రక్కనే ఈరుచ్ అనుసరించాడు.

వింత వుడుపులతో, ఈరుచ్ వెంటరాగా డా॥ నాథ్‌యిల్లు చేరారు. వారు చేరేసరికి, వీళ్ళను చూడాలనే తలంపుతో, అంతా ఎదురుచూస్తున్నారు. బాబా ధరించిన పచ్చని తలపాగా, తెల్ల గౌను, అవన్నీచూచి నాథ్ కుటుంబసభ్యులు చలించిపోయారు. ఈరుచ్ "మా భిక్షా దీజియే" అని కేకవేయగా, బాబా అతని స్వరమున కనువుగా తమ పెదవులు కదిలిస్తూ అవే పదములు వ్రాసివున్న తన చంకలోని జోలెను ముందుకు చూపించారు.

ఈరుచ్ బాహ్యంగా పలికిన స్వరానికి, అనుగుణ్యంగా బాబా ముఖ కవళికలు ప్రతిచర్యగా ప్రతిఫలించినవి. అతని స్వరానికనువుగా బాబా చూపిన హావభావాలు చూపరులకు, ఆ స్వరము బాబా ముఖంనుండే వెలువడినట్లున్నది. యీరుచ్‌కూడ

నవజీవన దుస్తుల్లోనే వున్నాడు. చేతులో అక్షయపాత్ర, చంకలో జోలె వున్నాయి.

అలా భిక్ష అర్థించగానే, డా॥ నాథ్ దంపతులు స్వయంగా వారిద్దరి జోలె నిండుగా భోజనం సమర్పించుకున్నారు. యిద్దరి వద్దనున్న అక్షయపాత్రలుకూడ నిండిపోయినయి. చిరునవ్వుతో పెద్దన్నయ్యగా వారి ప్రేమ భిక్షను స్వీకరించారు. అందుకు తమ కృతజ్ఞతను వారికి చేరి సౌంజ్ఞతోనే తెలుపుతూ వెంటనే వెను తిరిగారు. వారు పెట్టిన ఆహారం స్వీకరించి, అసలు ఏమి జరిగినదో, ఆ వచ్చినవారెవరో, వారు వూహించేలోపలే, బాబా, యెరుచ్‌తో వెనుతిరిగి వెళ్ళిపోయారు.

## స్వచ్ఛంద భిక్ష

క్షణంలో లేరుకున్న డా॥ ఫేర్ దంపతులు మరల మరుసటి రోజునకూడ భిక్ష కొరకు బృందంవారిని, తమయింటికి రమ్మన మని కబురంపారు. అందుకు కారణంకూడ తెలిపారు. అలా భిక్షార్థిపై వచ్చేవారితో తాము ఫొటో తీయించుకొనదలచితిమని, కనుక అందుకుకూడ అనుమతించమని అభ్యర్థించారు.

మీకు తెలుసునో లేదో, బాబా ఆదీజీతో నవజీవనపు దుస్తులతో దిగినఫొటో యిప్పటికీ మెహెరాబాదు మ్యూజియంలో భద్రపరచబడింది. అది యీ రెండవరోజున డా॥ నాథ్‌గారింటి ముందు తీసిన ఫోటోయే. అది బెనారస్‌లో రెండవరోజున భిక్షాటన తాలూకు తీసినఫొటో.

బాబాకు ఫోటోలంటే యిష్టం వుండదు. కనుక ఫోటో తీయుట కనుమతించరేమోనని శిష్యులనుకున్నారు మొదట్లో, కానీ బాబా ఫోటో తీయాలని సంకల్పించినట్లున్నారు. వెంటనే తన ఆమోదాన్ని తెలిపారు. మరునాడు బృందంలోని యిరువురు భిక్షర్థులై తమయింటికి వచ్చేదరని కబురంపారు. ఫోటోతోనే ఏర్పాట్లు చేయించుకోమన్నారు.

బృందంవారు మళ్ళీ తమయింటికి రానున్నారన్న వార్తవిని డా॥ నాథ్ చాల సంతోషించాడు. ఫోటో తీయుటకు, ఛాయా గ్రాహకుని సిద్ధంగా పిలిపించుకున్నాడు. సమయానికి డా॥ ఖేర్ కూడ వచ్చి అక్కడేవున్నాడు.

రెండవరోజు భిక్షటనలో బాబా తలపాగా ధరించలేదు. ఆయనవెంట యీసారి ఆదీజీ వున్నాడు. యిరువురూ తలపాగా ధరించకున్నా, నవజీవన దుస్తులు వేసుకున్నారు. డా॥ నాథ్‌కు బాబానుగురించి ఏమీ తెలియదు, కానీ డా॥ ఖేర్‌కు, తన తలి దండ్రులు బాబా ప్రేమికులై యున్నందున, ఆయన రూపురేఖలు తెలుసును.

ఎలానైతేనేమి బాబా ఆదీజీతో వెళ్ళగానే వారి ఫోటో తీశారు. తరువాత, వారిరువురి జోలె, అక్షయపాత్రలనిండా ఆహారం నింపి పంపారు. యీవిధంగా రెండవరోజుకూడ బాబా స్వయంగా కాశీమహానగరంలో తమ భిక్షటన కొనసాగించారు.

ఆనాడు తీసిన వారిఫోటోను, డా॥ ఖేర్ తన తండ్రికి చూపగా, దానిని చూడగానే ఆయన "అవతార్ మెహెర్‌బాబా"

అని గుర్తించి, ఆవిషయం అందరికీ తెలియచేయబడింది. అంత, బృంద నాయకుని బాబాగాను, తక్కినవారు ఆయన శిష్యులుగాను గమనించారు. విషయం తెలుసుకొని తమ అదృష్టానికి మురిసి పోయారు.

వీరు మెహెర్‌బాబా అని తెలియకపూర్వమే, డా॥ ఖేర్ చన తలిదండ్రులను, డా॥ నాథ్ గారింట్లో యీ బృందంవారికి భోజన సదుపాయాలు ఏర్పాట్లు చేయుటకు హమీర్‌పూర్‌నుండి పిలిపించారు. బృందంవారికొరకు, వారు స్వయంగా రెండు రోజులుగా వంట చేస్తున్నారు. అలా వారు వంటపనిని, బాబా బృందానికి నిర్దేశించబడిన భోజనమని తెలియకనే ప్రారంభించారు.

## లౌకిక విధాన పరిరక్షణ

కానీ ఫోటోచూచి, బాబాను పోల్చుకొని గుర్తించిన తర్వాత, డా॥ నాథ్, డా॥ ఖేర్, ఆయన తలిదండ్రులు కూడ, ఆ విషయాన్ని బయటకు పొక్కనీయకుండా, శిష్యులవద్దకూడ బయటపడక జాగ్రత్తవహించి, గుంభనంగా, అతి గోప్యంగా వుండిపోయారు. బృందం, బృంద నాయకుని గురించి ఏమీ ఎరుగనట్లే నటించారు.

వారి భావనలో ఒకవేళ బృందం వివరాలు తాము గ్రహించి నట్లు బయటపడితే, యిహ పరిస్థితులు అలా వుండవని భయపడి, అంత గోప్యంగా వుండిపోయారు. అలా వారు గ్రహించినట్లు బయటపడితే, బృందంవారు వెళ్ళిపోతారేమో నని భయపడి

గోప్యంగా వుండిపోయారు. అందుకని ఇలా దాగుడుమూత లాడారు.

అలా రోజులు గడుస్తున్నాయి. మూడోరోజునుండి, నాథ్ గారింటినుండి వంట చేయించి, తమ మనిషిద్వారా నాతి యిస్లికి పంపుతున్నారు. రోజూ వంటగురించి ఏదో ఒక కబురు పంపేవారు. ఈరోజు వంట సామాన్యంగా వున్నదని, యిన్నాళ్ళ నుండి రోజూ పప్పు, అన్నం మాత్రమే పంపుతున్నారని, ఈరోజు ఏదైనా కూర పంపకూడదా? అని యిలా ఏదో ఒక వార్త పంపేవారు.

రోజూ పంపే ఆహారం ఎందుకు మార్చరని, ఒకరోజున అడిగారు. అయితే పాపం, బృందంవారు ముందుగా విధించిన షరతుల కనుగుణ్యంగా మాత్రమే వారు ఆహారం పంపుతున్నారు, కానీ బాబా అదనీ, ఇదనీ ఏదో ఒక కబురు పెడుతూనే వున్నారు. ఒక్కొసారి విష్ణుమాష్టరుని పంపేవారు.

డా॥ నాథ్ గారింట్లో వంటచేసే వంటవారెవరో బృందానికి తెలియదు. విష్ణు మాష్టరుకు కూడ తెలియదు. అక్కడ వృద్ధులైన, ఓ ముసలమ్మ, ముసలాయన వంట చేస్తున్నారనిమాత్రం బృందంవారు వూహించారు.

రోజూ బాబా భోజన పదార్థములపై ఏదో ఒక వ్యాఖ్య చేయడంతో ఒకరోజున శిష్యు లిద్దరు బయలుదేరి వంటగదికి వెళ్ళి వంటకాల రుచులలో బృంద నాయకుని వాంఛితమును గురించి

ఫిర్యాదు చేయబోయారు. తీరా వారు వంట గదికి వెళ్ళేసరికి అక్కడ వారిరువురు వృద్ధులను గమనించారు. వారిరువురు బహుశః డా॥ సాఫ్ నియమించిన వంటవారై యుంటారని తలపోశారు.

వారు డా॥ ఖేర్ తలిదండ్రులని, బృందంవారికి వంట చేసి పెట్టుటకు ప్రత్యేకంగా పిలిపించబడినారని వారికి తెలియక, వెళ్ళిన మిత్రులిరువురు వారిమీద హుకుం చలాయించసాగారు. వారు వండి పంపుతున్న వంటలు బాగా లేవని,అదనంగా కూరలు, పచ్చళ్ళు కూడ వుండాలనీ, అదనీ, ఇదనీ సతాయించారు. వారి ధ్యేయ మేమంటే వారి నలా సతాయిస్తూ దబాయిస్తే, తద్వారా బాబాను సంతోషపెట్టవచ్చునని వారి భావన. ఎందుకంటే, బాబా ఆనాడు వంట గురించి వ్యాఖ్యానించారుగదా!

అలా శిష్యులు ఎన్ని మందలింపులు విసిరినా, పాప మా వృద్ధులు పల్లెత్తు ఎదురు జవాబివ్వలేదు. ఎట్టి తిరస్కారభావం వెలువరించలేదు. పైపెచ్చు, సాదరంగా వారి వ్యాఖ్యలను స్వీకరించి, ప్రేమతో వారి ఆదేశాలను పాలించారు. వారు కోరిన విధంగా వంటకాలు మార్చి తయారు చేశారు. అయితే ఆతరువాత పాప మా శిష్యులు, ఆ వృద్ధులు డా॥ ఖేర్ తలిదండ్రులని తెలుసుకొని, వారివంక ముఖమెత్తి చూడలేక పోయారు. సిగ్గుతో తల వంచారు.

న్యాయానికి శిష్యులు వారియెడల అలా కఠినంగా ప్రవర్తించుట సబబుగాదు. అయినప్పటికీ, అందుకు భిన్నంగా ఆ

దంపతులు ఎంతో ప్రేమతో వారి అభ్యర్థన మేరకు వంటలు తయారు చేసి పంపుతూనే వున్నారు.

## ఉన్నత ప్రమాణాలు

తన బృందంతో బాబా ఎక్కువ రోజులు మజిలీ చేసిన ప్రదేశం బెనారసు. అక్కడ షుమారు నాలుగు వారాలు మజిలీ చేశారు. 15 నవంబరు 1949 నుండి 12 డిశంబరు 1949 వరకు సాగిందా మజిలీ. ఈ సమయంలో కొన్నాళ్ళు సారనాథ్‌లో కూడ వున్నారు. సారనాథ్ బెనారసుకు అతి సమీపంలో వున్న పవిత్ర స్థలము. అక్కడ బుద్ధుడు, తాను సాక్షాత్కారం పొందిన పిమ్మట, తన ప్రప్రథమ బోధను ఇక్కడే వినిపించాడు.

యీ ప్రాపంచిక మాయనుండి, బంధ విముక్తుడై, తెరను తొలగించుకొని బుద్ధుడు తన బాధ్యతలను గుర్తించి మాట్లాడ మొదలిడినదీ సారనాథ్‌లోనే! యిప్పుడు అసలు కథకు వద్దాం. ఇది చాల పెద్ద కథ. దీనికిముందు మరో విషయం చెప్పాలి. బాబా ఆధ్యాత్మిక సార్వభౌముడు. గగనం, గగనాకాశమన్నట్లు, ఆయనకు ఆయనే సాటి. ఆయన జీవితం కడు మహిమాన్వితమైనది.

ఆయన జీవిత చరిత్ర అనేక సంఘటనలతో కూడి, చూపరులకు గందరగోళంగా కనపడుతుంది. సంఘటనలు పైకి మామూలుగా కనపడినా, ప్రతి సంఘటనా, దానియొక్క వుద్దేశ్యం

ప్రయోగం ఎంతో వున్నది. వాటి ప్రయోజనం ఎంతో దీర్ఘకాల సాంగత్యం వున్నవారికి కూడ లేశమాత్రమైనా విశదంకాదు. అది అవతారునికి మాత్రమే తెలియును. అందుచేత ఆయనతో స్వయంగా తగినంత పరిచయం లేనిదే అవతారుని కార్యకలాపములు తన బుద్ధి విశేషంచేత అర్థం చేసుకొనుటకు పూనుకుంటే, అది తుఫానుతో కూడిన మహా సముద్రంలో యీదుటకు ప్రయత్నించుట వంటిది కాగలదు.

అవతారుని యిచ్ఛ లేనిదే, ఆయన కృప లేనిదే వాటి అవగాహన అర్థంకాదు. బాబా విధించే షరతులు, సామాన్యునికి ఆచరణసాధ్యమైనవి కాకున్నా, అవి ఒక ఆధ్యాత్మికశక్తి గల వ్యక్తినుండి ఆశించ తగినవిగా వుండేవి. అందుకే శిష్యులు ఎన్ని కష్టాలైనా భరించి, బాబాతో సహజీవనం గడిపారు.

## ఆశలు - ఆశయాలు

ఇంతకుముందు మనము బెనారస్‌లో డా॥ నాథ్, డా॥ ఛేర్, ఆయన తలిదండ్రులు వంట వసతి ఏర్పాట్లు చేయుటగురించి తెలుసుకున్నాంగదా! అలా కొన్నాళ్ళు గడిపినదరిమిలా ఒక రోజున బాబా, ఈరుచ్‌ని పిలిచి డా॥ నాథ్ కో కబురు పంపారు.

"యిక్కడ తన మిత్రులతో నాతియిష్లి భవనంలో ఆనందంగా వుంటున్నాం. ఇది చాల సౌకర్యంకల భవంతి. మీరు మా విశ్రాంతికై సమస్తం సమకూర్చినందుకు ఎంతో సంతృప్తి

కలిగించింది. ఇవన్నీ బాగానే వున్నవి. అయితే మీకు అవకాశం వుంటే, చేయకలిగితే, చేయాల్సిన మరి కొన్ని విషయాలున్నాయి. 1. మీ ప్రేమకు చిహ్నంగా ఒక తెల్ల గుర్రాన్ని భిక్షగా సమర్పించాలి. అది ఎలాంటిదై వుండాలంటే, చెప్పినట్లు వినే పెంపుడు గుర్రమై వుండాలి. చక్కగా బలిసి పెరిగినదై వుండాలి. అంతా ఒకే రంగులో తెల్లగా వుండాలి. ఎక్కడా ఒక్క మచ్చకూడా వుండకూడదు. కనుగ్రుడ్లు, కంటి పాపలు, తోక, జూలు, వెంట్రుకలు సమస్తం తెల్లగా వుండాలి."

"ఒకవేళ డా॥ నాథ్ పైదానికి అంగీకరిస్తే, రెండవ కోరికగా ఒక ఒంటెను సమర్పించాలి. అలా ఒంటెను ఇచ్చుటకు అంగీకరిస్తే, అది మంచి పెంపుడు జంతువై, మచ్చికైనదిగా వుండాలి. బండి లాగుటలో మంచి శిక్షణ కలదై వుండాలి. దానితోపాటు ఒంటె లాగే బండికూడ పంపాలి." మీకు తెలుసను కుంటాను, ఉత్తర భారతంలో ఒంటెబళ్ళు రెండంతస్తులలో ప్రత్యేకంగా తయారు చేస్తారు.

యివన్నీ వప్పుకుంటే, మరో విషయంలో కూడ చెప్పమన్నారు. వారి ప్రయాణమంతా కాలినడకనగదా ; దారిలో భిక్ష దొరికినా దొరకకపోయినా, కనీసం బాబాకు అవసరమయ్యేందుకు పాలు కావలసివచ్చేవి. అందువలన చక్కని, అధికపాలిచ్చే ఆవునొకదానిని పంపమన్నారు.

దీనికికూడ అతడు అంగీకరిస్తే, ఇంకా భిక్షలో మరొకటి ఇమ్మన్నారు. అదేమంటే, రెండు ఆడ గాడిదలు యివ్వమన్నారు.

అతడుగనుక బాబా వాంఛితాలన్నీ తీర్చుటకు సిద్ధపడితే, అప్పుడు ఈరుచ్, బాబా ఆజ్ఞలన్నీ ధృవపరచి, వాటన్నిటినీ ఫలానా తేదీ లోపల వెంటనే సమకూర్చమని చెప్పమన్నారు.

బాబా ఆదేశాలన్నీ తీసుకోని, యీరుచ్ ఒకరోజున డా॥ నాథ్‌గారింటికి వెళ్ళాడు. తన సమావేశ ఫలితం ఎలా వుంటుందో, ఏమి జరుగనున్నదో వూహించలేకపోయాడు ఈరుచ్. తీరా అతడు డా॥ నాథ్‌గారింటికి వెళ్ళేసరికి ఏమి జరిగిందో చూడండి! డా॥ నాథ్ నేత్ర శస్త్ర చికిత్సలో నిమగ్నమై యున్నాడు. తలుపులన్నీ మూసివున్నాయి. దొడ్డిదారిన వెళ్ళి చూచాడు. అక్కడా ఎవరూలేరు. కొంతసేపైన తరువాత, నౌకరొకరు కనపడి, "ఏం కావాల"ని అడిగాడు.

"నేను ఫలానా, మా పెద్దన్నయ్య నుండి ఒక ముఖ్యమైన వార్తను డా॥ నాథ్ గారికి చెప్పాలని తెచ్చాను. మరి ఆయన ఎక్కడా కనబడుటలేదు. ఇంట్లో లేరా?" అని అడిగాడు నౌకరుని.

"ఓహో! మీరా! లేదండీ! అయ్యగారు ఆపరేషను థియేటరులో శస్త్ర చికిత్స చేస్తున్నారు. యీవేళ ప్రత్యేకంగా శస్త్రచికిత్సాదినం" అన్నాడు.! "అదా! అయితేసరే, మళ్ళీవస్తాలే!" అని చెప్పి తిరుగుముఖం పట్టాడు. ఆగకుండా ఎందుకు బయలుదేరాడంటే అది బాబా ఆజ్ఞ. శిష్యుల నెక్కడికైనా పనిమీద పంపితే అక్కడ వారి సమయాన్ని వృధా చేయరాదు. ఆలస్యం వుంటే వెంటనే తిరిగివెళ్ళి, ఆ వైనం చెప్పి

మళ్ళీ వెళ్ళమంటేనే రావాలి. అందుచేత ఈరుచ్ వెంటనే తిరిగివెళ్ళి బాబాతో జరిగిందంతా వివరించాడు.

అయితే బాబా, కాసేపాగి మళ్ళీ వెళ్ళమన్నారు. వెళ్ళే ముందు, మరో విషయాన్ని జోడించారు. అంతకుముందు అనుకున్న అభ్యర్థనలన్నీ అంగీకరించేయెడల, అవన్నీ ఒక షరతుమీద మాత్రం స్వీకరిస్తామని చెప్పమన్నారు.

అదేమంటే డా॥ నాథ్ సమర్పించే వాటన్నిటికీ బదులుగా తన బృందమంతా వాడిన దుస్తులు, వారి వంటిపై వుండే వస్తువులు తీసుకోవాలని షరతు పెట్టారు. శిష్యులవైపు చూచి, "మన మీ స్థలం వదలిపోయేరోజున మీ వంటిపై వుండే సమస్తాన్ని డా॥ నాథ్‌కి యివ్వమ"ని ఆజ్ఞాపించారు.

## సమన్వయ సమావేశం

బాబా ఆజ్ఞలకు బద్ధుడై, కొత్త షరతుతో యీరుచ్ కొద్దిసేపైనతర్వాత డా॥ నాథ్‌గారింటికి వెళ్ళాడు. కానీ డాక్టరింకా శస్త్రచికిత్సలో వత్తిడిగానే వున్నారు. ఇంతలో నౌకరు, ఈరుచ్ వచ్చినట్లుగా లోనికి వెళ్ళి డా॥ నాథ్‌కు చెప్పినట్లున్నాడు. ఆయన సహాయకుడు కిటికీగుండా ఈరుచ్‌ని చూచి, అతని రాక గురించి, డా॥ నాథ్ చెవిలో రహస్యంగా చెప్పాడు.

అయితే మీరు నమ్ముతారో నమ్మరో, కానీ ఆవార్త విన్న డా॥ నాథ్ తాను చేసే శస్త్రచికిత్సను వెంటనే ఆపేసి, రోగిని లవ

రేషన్ బల్లపైనే వదిలేసి, బయటకువచ్చి "హలో! ఏమిటి సంగతి?" అని ఈరుచ్‌ని పలకరించాడు. "ఏమిటి? నాతో ఏమైనా పని వున్నదా? నేనేమైనా మీకొరకు చేయవలసి వున్నదా?" అని ప్రశ్నించాడు.

"అవును. చెప్పవలసిన అతి ముఖ్యమైన వార్తొకటి వున్నది. మా పెద్దన్నయ్య మీతో చెప్పమన్నారు. అయితే మీ రా వార్త వినాలంటే, ఏకాగ్రచిత్తులై ప్రశాంతంగా వుండాలి. మీ మనస్సు వేరేచోట వుండరాదు. అది అంతటి అత్యంత ప్రధానమైన వార్త." అని వివరించాడు.

అసలు బాబా, యీరుచ్‌తో ఆజ్ఞలు వివరించేముందే, డా॥ నాథ్‌కు విషయాలు చెప్పే సమయంలో ఆయన దృష్టి కేంద్రీకరించి, మనస్సుకు ఏ అవరోధం లేకుండా, తాను పంపిన వార్తను వినకలగాలని ఆదేశించారు.

"నేను వినటానికి సిద్ధంగానే వున్నాను. విశేష మేమిటో చెప్పు" మన్నాడు. "కానీ డాక్టర్! అక్కడ రోగి సగం శస్త్ర చికిత్స చేయబడి బల్లమీద వున్నాడు. మధ్యలో ఆపి మీరు బయటకు వచ్చారుగదా! మీరు యిక్కడవున్నా మీ దృష్టంతా ఆ రోగిమీదనే వుంటుందికదా! మరి మా నాయకుని వాంఛితం ప్రకారం, ఏకాగ్రత చూపలేరు" అన్నాడు ఈరుచ్.

అంత డా॥ నాథ్ కొంచ మాలోచించి "ఇప్పుడేవస్తానుండమని" చెప్పి లోనికి వెళ్ళాడు. ఈరుచ్ వరండాలో

కూర్చున్నాడు. కాసేపట్లో శస్త్ర చికిత్స పూర్తిచేసి డా॥ నాథ్ బయటకు వచ్చాడు. ఈరుచ్‌ని తన గదిలోకి తీసుకువెళ్ళాడు. తాపీగా కూర్చొని, బాబా వాంఛితములలో మొదటిదైన తెల్ల గుర్రం విషయం చెప్పాడు.

విషయం విన్న డా॥ నాథ్ ఏ మచ్చాలేని తెల్లగుర్రం దొరకుట కష్టమేనన్నాడు. భిక్షలో సమర్పించుట, ఏమంత కష్టం కాకపోవచ్చును. అయితే పెట్టిన గడువు 15 రోజులలో సాధ్య పడకపోవచ్చును. అయినప్పటికీ నౌకరులను నాలుగువైపులా పంపి వాకబు చేయిస్తానన్నాడు. చేతనైన సాధనలన్నీ చేసి పెట్టిన గడువు లోపల సాధించలేకపోతే క్షమించమని కోరాడు.

మొదటి కోరిక వప్పుకున్నందున, ఒంటె, ఒంటె బండి, ఆవు, యిలా ఒకదాని తరువాత ఒకటి చొప్పున ఆయన సరే అన్నప్పుడల్లా, యీరుచ్ బాబా వాంఛితాలన్నీ ఏకరువు పెట్టాడు. డాక్టరు అన్నీ విని ఒంటె విషయంలో అదేమంత కష్టం కాదు. మా దొడ్లోనే వున్నవాటిలో ఒకదానిని తోలి పంపుతాను. అయితే ఒంటె బండి యీ బెనారస్‌లో తయారు చేయరు. ప్రక్కజిల్లాల నుండి తెప్పించాలి. అక్కడ తయారవుతాయి. పోతే ఆవు మరీ సులభం. యివన్నీ వక్కరోజులో ఒనగూర్చవచ్చును అని చెప్పాడు.

అందుకు ఈరుచ్ తన కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ముందుగా తెల్లగుర్రం అన్వేషణ వెంటనే ప్రారంభించమన్నాడు.

తమ నాయకుడు కోరినవాటిలో అది మొదటిది కావున, అదిగనుక దొరకనిచో తక్కినవాటిని ఏర్పాటుచేయ నవుసరం లేదని చెప్పాడు. "అయితే సరే! నేను నా శాయశక్తులా ప్రయత్నిస్తా న"ని చెప్పాడు డా॥ నాథ్.

"ఏమండోయ్! అంతటితో కాలేదు. యివన్నీ కాక, యింకా మీరు మాకు భిక్షలో సమర్పించవలసినది మరోటున్నది. యీ పైవన్నీ మా ఉత్తరదేశ యాత్రలో అవుసరమై యున్నందున, మా పెద్దన్నయ్య రెండు ఆడ గాడిదలు కూడ కావాలని కోరి యున్నారు. వాటిని గూడ సరఫరా చేయాలి" అన్నాడు.

"ఏమిటీ? యాత్రలో గాడిదలా? విడ్డూరంగా వుందే? నేనెక్కడా యిలాంటిది వినలేదే?" అని ఆశ్చర్యపోయాడు డాక్టరు. "గాడిదలు యాత్రలలో ఉపయోగించ తగిన జంతువులు కావు. హిందువు లందుకు ఇష్టగించరు. గాడిద పవిత్రమైన జంతువు కాదు. నిజానికి గాడిదలను యాత్రలో తీసుకొని వెళ్ళిన అపవిత్రం చేసినట్లే. పవిత్రతకు భంగం కలుగుతుంది. ముస్లిములకు పంది ఎలాగో, హిందువులకు గాడిద అలా అపవిత్రమైన జంతువు" అని కూడ వివరించాడు.

తన మనసులో మానసికంగా కలిగిన ఆలోచనలు, అనుమానాలు, మరుక్షణంలోనే నశించిపోయాయి. ఆ కోరికలన్నీ ఒక అత్యున్నత వ్యక్తినుండి వచ్చినవి కనుక, ఆయన మనస్సులో రేకెత్తిన శంకలన్నీ పటాపంచలై పోయాయి. దానికీ "సరే!" అన్నాడు.

అప్పుడు ఈరుచ మరో షరతు జోడించాడు. "మీరిచ్చే పై అన్నిటికీ బదులుగా, యిరవై యిద్దరు బృందం, చాలా రోజులుగా ధరిస్తున్న మురికి గుడ్డలు, తదితరమైన వారు ధరించిన వస్తువులు మీరు స్వీకరించాలి. మేమీ ప్రదేశం వదలి వెళ్ళే రోజున మేము ధరించే దుస్తులు, చేతి గడియారాలు వగైరాలు వదలి వెళ్ళిపోతాము. మా నవజీవనంలో నిర్దేశించిన బారుగౌను, పచ్చటి తలపాగా మాత్రం వాటిలో వుండవు. మా పాతబట్టలు గడియారాలతో సహా మీ కిచ్చేస్తాం. వాటిని మీరు తీసుకోవాలి" అని వివరించాడు.

అప్పుడు డా॥ నాథ్ "మీ పెద్దన్నయ్య కోరినవాటన్నిటినీ సమకూర్చుట కంగీకరిస్తున్నాను. కానుకలన్నీ మార్పిడి పద్ధతిపై సమర్పించుటకు సిద్ధముగా ఉన్నాను. అయితే నాదో చిన్న షరతు. మీ బృందమందరి మురికి బట్టలతో పాటు మీ పెద్ద అన్నయ్యగారి మురికి బట్టలుకూడ వుండాలి" అని అభ్యర్థించాడు.

అందుకు యీరుచ్ తగు హామీ వెంటనే యివ్వలేనని, ఆయనతో సంప్రతించిన మీదనే తెలుపగలనని చెప్పాడు. అసలు బాబా తన బట్టల నెన్నడూ విసర్జించరు. ఆయన బట్టలు మెహెరా యొక్క ప్రత్యేక ఆస్తి. వాటిని పొందే అవకాశం ఆమెకు మాత్రమే బాబా యిచ్చారు. అందుచేత ఈరుచ్ వెంటనే హామీ యివ్వలేకపోయాడు. అందుకు డా॥ నాథ్ తన షరతుకు అంగీకరిస్తే, ఆ మరుక్షణం తెల్లగుర్రం అన్వేషణ కార్యక్రమాన్ని మొదలుపెడతానని చెప్పాడు.

ఇరువురూ ఒకరి కొకరు కరచాలనం చేసుకొని, ఎంతో ప్రేమాభిమానములతో విడిపోయారు. ఈరుచ్ డా॥ నాథ్ యొక్క ప్రేమకు ఎంతో ముగ్ధుడై ప్రశంసించాడు. ఆ తరువాత బాబావద్దకు చేరి, తమ యిరువురిమధ్య జరిగిన సంభాషణంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

అంతా విన్న తరువాత, బాబా ఈరుచ్‌ని మళ్ళీ డా॥ నాథ్ వద్దకు వెళ్ళి, ఆతని వినయానికి తా నెంతో ముగ్ధుడైనట్లు, అంతే కాక ఆతను కోరినట్లు తాను విడిచిన బట్టలు కూడ తక్కిన మిత్రుల బట్టలతోబాటు జత చేయుదునని చెప్పమన్నారు. ఈరుచ్ ఆ ప్రకారమే డా॥ నాథ్ వద్దకు వెళ్ళి తన షరతుకు, పెద్దన్నయ్య అంగీకరించినట్లు తెలుపగా ఆయన ఎంతో సంతోషించి, ఆనంద పరవశుడైనాడు. అంతటితో వారి సమావేశం సమాప్తమైనది.

## సమైక్యత - సంఘీభావం

సరే అలా రోజులు గడుస్తున్నాయి. డా॥ నాథ్‌కు, వారింట్లోని వంటశాలకు బాబా నుండి ఎన్నో వార్తలు వస్తూనే వున్నాయి. కాశీలో ఒక వారం గడిచింది. రోజూ భోజనం నాథ్ గారింటినుండి దూరాన వున్న నాతియుమ్లి భవనం వద్దకు పంపబడుతోంది. డా॥ నాథ్‌గారింట్లోనే ఆసుపత్రి వుండుటవలన, ఆ రద్దీలో, యింత పెద్ద బృందానికి సరిపడిన ఆహారం తయారు చేసి పంపటం వారి కో సమస్య అయింది.

వంట హడావిడిలో ఆసుపత్రి నడుపుట ప్రతిబంధకంగా తయారైంది. రోగులకు యిబ్బందికరంగా వుంది. అయినా డా॥ నాథ్ ఎట్టి సంకోచం రానీయక నిత్యం వంట తయారు చేయించి పంపుతున్నాడు. అంతలో ఒక రోజున బాబా, వంట శాలను, దూరంగా వున్న డా॥ నాథ్ యింటినుండి, తామున్న భవనంలోకి మార్పించి అక్కడే వంట చేయించే ఏర్పాటు చేయ మని కబురంపారు.

యిప్పుడు వంట వ్యవహారం, వారున్న భవనానికి తర్లిస్తే వంట చేసే వ్యక్తులు డా॥ ఖేర్ తలిదండ్రులు, బాబా ప్రేమికులైనందున ఆ యదార్థాన్ని బృంద నాయకుని కెలా ఎరుకపర్చా లనే సమశ్య ఎదురైంది.

అంతలో బాబా అందుకొని, "యిప్పుడు వంటవారు యిక్కడకు రాబోతున్నారుగదా! వారి గురించిన వైనమేమిటి? వారెలా వంట చేస్తారు? అసలు వారెవరు? వారు బెనారసు కాపురస్తులేనా? వారు వృద్ధులా? యువకులా?" అంటూ అనేక ప్రశ్నలు వేశారు. అనుకోకుండా వచ్చిన యీ ప్రశ్నలతో, శిష్యులు అవకాశంగా తీసుకొని, వారినిగురించి, అంతా సవిస్తరంగా బాబాకు చెప్పారు.

## ఉరుములు - మెరుపులు

అప్పుడు బాబా, వెంటనే యీచోటు వదలి వేరే ప్రదేశానికి రోజే వెళ్ళిపోదా మన్నారు. సారనాథ్‌కి వెళ్ళిపోదామన్నారు.

వెంటనే నాథ్ గారికి భిక్షలో సమర్పించ వలసిన కానుకలు వెంటనే సమర్పించమని కబురు పంపారు. తెల్లగుఱ్రం దొరకనందున యింకా ప్రయత్నిస్తున్నారని కబురు వచ్చింది.

ఒక రోజున తెల్లగుఱ్ఱం దొరికిందన్న చల్లని వార్త విన్నారు. బాబా అనుమతికై దానిని తోలుకొచ్చారు. దానిని చూడగానే బాబా ఎంతో మెచ్చుకున్నారు. మిగిలిన కానుకలన్నీ సత్వరంగానే సమకూర్చబడినై.

తెల్ల గుఱ్రాన్ని డా॥ విలియం డాన్కిన్ అధీనంలో వుంచారు. ఒంటె, ఒంటెబండి బైదుర్ అజమాయిషీక్రింద వుంచబడినవి. ఆవును పటేల్ సంరక్షణలో వుంచారు. యీతనిని బాబా ప్రప్రథమంగా తన శిష్య బృందంలో మొట్టమొదటి శిష్యునిగా పూనాలోని పల్లెకారుల నుండి స్వీకరించారు. బాబా పురాతన మండలిలో వృిధము డాయన. గాడిదలను గుస్తాద్జీ అధీనంలో వుంచారు. ఆవు దూడను సీలూ నెండూల మధ్య పంచారు.

తమ బృందానికి వంట చేసిపెట్టేవారు బాబా ప్రేమికులై నందున, బాబా మరి ఎంతమాత్రం ఎక్కువ రోజులు అక్కడ వుండదలచక, అక్కడనుండి తమ మకాం ఎత్తివేసే ఏర్పాట్లను త్వరితంగా చేస్తూ, క్రొత్త ప్రదేశం కొరకై తగు ప్రణాళికను సిద్ధం చేశారు.

వంటకు నియోగించినవారు బాబా ప్రేమికులని బహిర్గతం కాగానే, వారైతే బాబాను చూచే అవకాశం లేనప్పటికీ, వృితిదీ

జటిలంగా తయారైంది. బాబా కదలికలు కూడ ప్రతిబంధకంగా మారాయి. అందుకు బాధ్యులైనవారి మనోభావాలు దెబ్బతిన రాదని, బాబాయే ఎంతో జాగ్రత్త పడేవారు.

## ఆ రా ధ న

అంతలో ఒకరోజున ఈరుచ్‌ని పిలిచి, వెంటనే డా॥ నాథ్ వద్దకు వెళ్ళి, మేమంతా యిప్పుడు సారనాథ్ వెళ్ళిపోతున్నామని చెప్పి రమ్మన్నారు. సారనాథ్‌లో కొద్దిరోజులుండి, ఆపిమ్మట మాయిష్టంవచ్చినట్లు మరో ప్రదేశానికి వెళ్ళిపోతామని, మరి సారనాథ్‌లో వున్నన్నాళ్ళు తమ బృందంతో మకాం చేయుటకు అనువగు మంచి ప్రదేశం చూచిపెట్టమని అడగమన్నారు.

ఈరుచ్ వెంటనే వెళ్ళి, డా॥ నాథ్‌కు బాబా ఆజ్ఞ విని పించాడు. విషయం విన్న డా॥ నాథ్ పరిస్థితి అర్థం చేసు కున్నాడు. నిజానికి మిత్రులంతా విడిది చేయుట కనువగు భవనం, తన వూహలో మెదిలింది. "సరే." అన్నాడు.

ఈలోగా, మెహెరాబాదునుండి పాద్రిచేత స్వయంగా తయారు చేయించిన పెట్టెబండి ( కారవాన్ ) బెనారస్ రైల్వే స్టేషనుకు తెప్పించబడింది. ఆబండి యిప్పటికీ మెహెరాబాద్‌లో వుంది. పాద్రి అదే రైలులో రెండు ఎద్దులను కూడ తీసుకు వచ్చాడు. అవి ఇంగ్లీషు జాతివి. అసలు వాటిలో ఒకటి ఎప్పుడో మరణించింది. అందుచేత జత చీలకుండుటకై మరో

ఎద్దును తెప్పించారు. వీటికితోడు మరో రెండెద్దులు, ఓ ఎద్దుల బండికూడ తెప్పించారు.

ఈ జంతువులను, బళ్ళను రైలునుండి బయటకు దింపే సమయంలో బాబా నవజీవన మిత్రులను, తమ పాతమిత్రుడైన పాద్రితో, కాసేపు మాట్లాడుకొనుటకు అనుమతించారు. మరి అతడిప్పుడు పూర్వ జీవనంలో వున్నాడుగదా! నియమం ప్రకారం, వీరికి పూర్వజీవనంలో వున్నవారితో ఎలాంటి అనుబంధం లేదు.

అలా వారిపని పూర్తికాగానే, పాద్రిని రైల్వేస్టేషనులోనే వదలి, ఎద్దులను, బళ్ళను తోలుకొని, శిష్యులు తమ స్థావరం చేరుకున్నారు. ఆరోజే ఒంటె, ఒంటెబండి కూడ స్థిరపరచ బడినవి. మరి వీరంతా కాశీనగరం వదలి వెళ్ళేరోజున, తమ షరతుప్రకారం, తమ దుస్తులన్నీ డా॥ నాథ్‌కు యివ్వాలనికదా నియమం.

మిత్రులతో మర్నాడు పొద్దున్నే వెళ్ళుటకు నిశ్చయ మైనది. అందువలన ఆరోజు సాయంత్రమే అన్ని ఏర్పాట్లు పూర్తిచేసుకున్నారు. వారు తమ శరీరములపై ధరించివున్న సమస్తం, బంగారం, రిష్టువాచీలతో సహా వలచి బాబా సమక్షంలో సమర్పించుకున్నారు. ఎవరి బట్టలు వారు వేరు వేరు మూటలు కట్టారు. బాబా బట్టలుకూడ వేరేమూట కట్టారు. ఆ మూటను యీరుచ్ స్వయముగా తన భుజంపై పెట్టుకొని డా॥ నాథ్ యింటికి తీసుకువెళ్ళి "అందరి బట్టలతోబాటు తన పెద్దన్నయ్య

బట్టలుకూడ ఇందులో వున్నాయి. మీ ఇష్టంవచ్చినట్లు చేసుకోనండి. కానీ మాకుమాత్రం త్రిప్పి పంపకండి " అని చెప్పి వప్పగించాడు.

అందుకు డా॥ నాథ్, వాటినలా త్రిప్పి పంపమని, చక్కాగా వుతికి పంపుతామని, తమ బృంద నాయకుని బట్టలుమాత్రం శాశ్వతంగా వారి జ్ఞాపకార్థం వుంచుకుంటామని చేప్పాడు. "అలా ఎన్నడూ చేయకండి! అన్నీ మీరే వుంచుకోనండి. ఒకవేళ త్రిప్పి పంపినచో, అంతా చెడిపోతుంది. సర్వత్రా యిప్పుడున్న సుఖ సంతోషాలు చెదిరిపోతయి. కనుక పంపే యోచన మానమని " చెప్పాడు.

డాక్టరుగారి కుటుంబ సభ్యులు, బృందంవారి బట్టలు, వస్త్రువులు మహాప్రసాదంగా స్వీకరించారు. ఆతరువాత, బృందమంతా విడిది చేయుటకై చక్కాని బంగళాను సారనాథ్‌లో ఏర్పాటు చేశాడు. ఆ బంగళా చేరుటకు వారంతా అట్టహాసంగా బయలు దేరారు. అంతా నవజీవనం వుడుపులు వేసుకున్నారు. జంతుజాలం, బళ్ళు వగైరాలుతో పెద్ద, దేవుని వూరేగింపులా వుంది వారి ప్రయాణం. పెండూబైదుర్ నాయకత్వం వహించగా, మిత్రబృందమంతా ఒక పెద్ద వూరేగింపుగా కాశీనగర వీధులగుండా సారనాథ్‌వైపు పయనమైనారు. రోడ్డువెంటవున్న పాదచారులు, వీధులలో వున్నవారు, వీరిని వింతగా చూచారు.

## కీలకపాత్ర

అలా వూరేగింపుగా బయలుదేరిన బృందం డిశంబరు 1-వ తేదీన సారనాథ్ చేరారు. మహిళలు నలుగురు ఒక బంగ

శాలో వున్నారు. పురుషులు వేరే గదులలో వున్నారు. తెల్ల గుర్రం సంరక్షణభారం, సారనాథ్‌లో మెహెరాకు వప్పగించారు. ఆమెకు గుర్రాలంటే మక్కువ ఎక్కువ. అందుచేత యీ బాధ్యత బాబా ఆమెకు వప్పగించారు.

ఇక్కడ వీరి కేర్పాటు చేసిన బంగళా చాల విశాలమైనది. చుట్టూ నిమ్మ మొదలగు ఫలవృక్ష భరితమైన వుద్యాన వనంతో చూడముచ్చటగా వుంది. ఈ భవంతి అంతటికీ ఒక కాపలాదారు, అదే కాంపౌండులో విడిగావున్న చిన్న పురాతన గృహంలో నివాసమున్నాడు. అతనిదో పెద్దకథ. అతడిగురించి తర్వాత తెలుసుకుందాం.

దొడ్డిదారి కొంచెం దూరంలో వుంది. డా॥ నాథ్ మరో తెల్లగుర్రాన్ని సారనాథ్ బంగళాకు పంపి, అంతకుముందు ఇచ్చిన తెల్లగుర్రంకన్నా ఇది యింకా తెల్లటిదనీ, ఆ రెండింటిలో యిష్టం వచ్చింది వుంచుకోమని కబురంపగా, బాబా మిత్రులవద్దకు వచ్చి మరో తెల్లగుర్రం వచ్చింది, యీ రెండింటిలో ఏది బాగున్నదో? దేనిని తీసుకోవాలో నిర్ణయించమన్నారు.

దొడ్డి దారిలో రెండుగుర్రా లున్నాయి. అక్కడకు మహిళ లనుకూడ పిలిపించారు. వారితోకూడ, ఆ రెండింటిలో ఏది బాగున్నదో ఎంపిక చేయమన్నారు. ఆ రెంటిని మెహెరా ఆప్యాయతతో నిమిరింది. బాబాకూడ అలానే మృదువుగా నిమిరారు. అందులో ఒకటి పొట్టిగావుంది. దానిని చూచి,

మెహెరా "యిది స్వారీకి బాగుంటుం" దన్నది. అందుకు బాబా స్వారీచేసే ప్రశ్నే లేదన్నారు.

అంతట మెహెరాతోపాటు తక్కిన మిత్రులంతా కూడ ముక్త కంఠంతో పెద్దదైన ఆ రెండోగుర్రం, చిన్న మచ్చకూడ లేకుండా, తెల్లగా, స్ఫటికంలా, ఎంతో చూడ ముచ్చటగా వుందన్నారు. కళ్ళు, పాపలుకూడ తెల్లగా వున్నాయి. నిజానికా తెల్ల గుర్రం ఎంతో అందంగావుంది. అందుచేత, ఆ పెద్దగుర్రాన్నే వుంచుకొనుటకు బాబా అంగీకరించారు.

ఆ గుర్రం సంరక్షణభారం సారనాథ్‌లో మెహెరాకు వప్పగించారు. దానికి దానా పెట్టుటకై పెద్ద బోరాములో గుగ్గిళ్ళుంచారు. పురుషులు స్త్రీలున్న చోటుకు రాకూడదు. కనుక, గుర్రం కట్టేసి వుంచిన గుర్రపుశాల వరకు "దానా"ని ఆడవారే మోసుకు వెళ్ళేవారు. వారున్న గది కా శాల, కొంచెం దూరంగా వుండుటచేత, బరువున్న "దానా" సంచి మోసి ఆడవారు అలసి పోయేవారు.

అలా వారి నేతృత్వంలో ఆ గుర్రం మచ్చిక అయ్యేసరికి బాబా యిహనుండి ఆ గుర్రాన్ని ఆమెనే సాకమన్నారు. అలా అంటూనే ఆయన కూడ ఒకసారి ఆ గుర్రాన్ని ఆప్యాయతతో నిమిరారు. ఆ సమయములో, అది చూచుటకు దేవతలా, ఎంతో సాధు స్వభావంతో శాంతంగా కనపడింది. మెహెరా కొంచం పచ్చగడ్డి నోటి కందిద్దామని ముందుకు వంగింది.

ప్రక్కనే మణి కూడ వుంది. ఆమెకు గుర్రాల్ని గూర్చి ఏమీ తెలియదు. కేవలం మెహెరాకు సహాయకురాలిగా మాత్రమే ఆమె ప్రక్కన ఉంది. ఆమె ఏమి చెబితే అది చేసేది. ఒక్క రోజులో దానిని పెంపుడు జంతువుగా మెహెరా మార్చింది.

మొదట్లో ఆహారం అందిచ్చినప్పుడు, సాధు భావంతో, ప్రేమగా దానా తిన్నది. అన్ని గుర్రాల వలెనే సాత్వికంగా ప్రవర్తించింది. ఆ తర్వాత తనపాత్ర ఏమిటో అది గ్రహించి నదో ఏమో అది పూర్తిగా మారిపోయి విజృంభించింది. అర్ధ రాత్రయ్యేసరికి ఒక రాక్షసిలా తయారైంది. తన దగ్గరకు ఎవ్వరినీ రానీయకపోయింది. చెవులు రిక్కపొడిచి, మోర ఎత్తి, పళ్ళు బిగించి, భయంకర రూపంగా మారిపోయింది.

శిష్యులెవ్వరూ దానిని బుజ్జగించలేకపోయారు. అప్పుడు విపరీతమైన చలిగావుంది. అందుచేత దాని వీపు నిమిరి వేడి పుట్టించాలని ప్రయత్నిస్తే ఎవరినీ దగ్గరకు రానీయలేదు. మరు నాడు బాబా వచ్చినప్పుడు మెహెరా గుర్రం ప్రక్కనే వున్నది. బాబా రాకను గమనించి " బాబా! ఆగండాగండి! దాని చెవులు చూడండి నిక్కబొడుచుకొని వున్నాయి. దాని దగ్గరకు వెళ్ళ కండి!" అని విన్నవించింది మెహెరా. అప్పుడా గుర్రం ఎదురు తిరుగుటకు సిద్ధంగా వుంది.

# అద్వితీయ నాయకుడు

"ఏమిటి! నిన్న చాల శాంతంగా కనపడిందికదా! ఎందుకిలా మారింది?" అని సౌంజ్ఞ చేశారు. అంతా దానికి దూరంగా జరిగారు. దాంతో ఏమీ జరుగలేదు.

ఆ తరువాత ఆ గుర్రపు సంరక్షణ భారం తిరిగి డా॥ డాన్కిన్‌కి వప్పగించారు. బృందమంతా సార్‌నాథ్‌లో కొన్ని రోజులుపాటు వున్నారు. అచ్చట చూడతగిన ప్రదేశాలన్నీ బాబా తోటిమిత్రు లందరినీ తీసుకువెళ్ళి చూపించారు. సారనాథ్‌లో గుహలున్నాయి. బుద్ధుడు అనుచరులతో సంచరించిన పవిత్ర ప్రదేశా లెన్నో వున్నాయి. వాటిలో బాబా తనతోపాటు పురుషులందరినీ వెంటబెట్టుకొని వెళ్ళి ఒక గుహలో చాలసేపు కూర్చున్నారు. ఈ గుహలోనే గౌతముడు సాక్షాత్కారప్రాప్తి బడసిన పిమ్మట తన మొట్టమొదటి బోధను తన అయిదుగురు శిష్యులకు బోధించినట్లు చెపుతారు. ఆనాడు బాబా తన శిష్యులను కేవలం గోటీ మాత్రమే ధరింపచేసి మౌనంగా 15 నిమిషాలు పాటు భగవత్‌స్తుతి చేయించారు. ఆ ప్రార్థనైన తరువాత బట్టలు ధరించి వరుసలో వుండమన్నారు. ప్రతివారితో స్వయంగా కరచాలనం చేసి, ఘనీతో హిందీలో "అయిపోయింది" అని ఏడుసార్లు బిగ్గరగా అరుచునట్లు చేసారు. అయితే అలా మౌనంగా కూర్చున్న సమయంలో ఆయన ఏమి కార్యక్రమం చేశారో తెలియదు.

కానీ మిత్రులందరినీ నిశ్శబ్దంగా వుండమని తనచుట్టూ కూర్చోబెట్టుకున్నారు. కొంత తడవైన తర్వాత వివిధ ప్రదేశాలలో ఉన్న చూడతగిన ఆరామాలు, ఆలయాలు, బుద్ధుని జాతక కథల చిత్రాలు, విగ్రహాలు చూచుకుంటూ తమ విడిదికి చేరేవారు. బుద్ధుని ఒక ప్రత్యేక ఆలయం వున్నది. ఆ ఆలయంలో బుద్ధుని విగ్రహం కడు రమ్యంగా తయారు చేశారు. చుట్టూ గోడల నిండా బుద్ధుని జాతక కథలు, రమణీయంగా చిత్రించారు. బాబా బుద్ధుని విగ్రహానికి ప్రణామము లాచరించగా తక్కిన శిష్యులు కూడ అలానే ప్రణామము లాచరించారు.

## మధుర క్షణాలు

కారవాన్, ఎద్దులు తోలుకొని తెచ్చి బెనారస్‌లో బాబా ఆజ్ఞ మేరకు శిష్యులకు వప్పగించిన తరువాత పాద్రి తిరుగు ప్రయాణపై మెహెరాబాదు బయలుదేరాడు. ఆరోజే బాబా బృందం సారనాథ్ వెళుతుందని తెలుసుకున్న పాడ్రికి, తనలోవున్న పాత అలవాటు రెప్పగొట్టింది. ఫొటోలు తీయడం అతనికి సరదా. అయితే అతనిని కెమేరా వాడవద్దని బాబా కఠినమైన ఆదేశాలిచ్చారు. అయినప్పటికీ, ఆనాడు అలా ఫొటో తీయాలనే ఆకాంక్ష ఎంత దురద పుట్టించిందో యీ క్రింది సంఘటన వలన విశదపడుతుంది.

ఆనాడు, బాబా బృందమంతా పెద్ద వూరేగింపులా వెళుతున్నప్పుడు, ఒకమూలగా సందుమొదట్లో, దారిలో ఎక్కడోవున్న

చిన్న టీ దుకాణంలో కూర్చొని ఊరేగింపువంక చూస్తున్నాడు. బృందంలోనివారంతా భిన్న రీతులలో ప్రత్యేక దుస్తులు ధరించి, తలపాగాలు పెట్టుకొని ఒకరివెనుక ఒకరు పటాలంలా నడుస్తుంటే, ఆదృశ్యం ఎంతో చూడ ముచ్చటగా వుండి, అతని మనస్సులో దాగివున్న ఆకాంక్ష బహిర్గతమైంది.

ముందుగా గౌనులు, తలపాగాలు ధరించిన మిత్రులు నడుస్తుంటే, వారి వెనుక జంతువులు—ఒంటె, (దీనిపేరు భోలారాం) ఆవులు, గుఱ్ఱం, ఎడ్లబళ్ళు, కారవాన్‌పెట్టె బండి, మధ్యలో బాబా మరియు మహిళలు, యివన్నీ కలసి చూడముచ్చటగా కన్నులవిందు చేశాయి. అప్పుడు పాద్రి తనలో "ఆహా! ఈ సుందర దృశ్యం ఎంత అద్భుతంగా వుంది? యిలాంటి దృశ్యంతో వున్న ఫోటో ఏదీ మావద్ద లేదుకదా! యిప్పుడు యీ ఊరేగింపు దృశ్యం ఫొటో ఒకటి తీసుకుంటే ఎంత బాగుండును?" అనుకొని తల్లడిల్లిపోయాడు. మరి బాబా ఆదేశం—ఫొటోలేమీ తీయవద్దని వున్నందున, నిరాశతో నిట్టూర్చి ఆవేదన చెందాడంటాడు పాద్రి.

## తోటమాలికి బహుమానం

సారనాథ్‌లో ఉన్నన్నాళ్ళు బాబా ఏమి కార్యక్రమం చేశారో తెలియదు. అదేమి కార్యక్రమమోమరి. ఆరోజులలో

ఆయన ఏదేని విశ్వ కార్యక్రమం చేశారేమోకానీ, తన శిష్యుల కేమీ తెలియనీయలేదు.

బృందంవారున్న బంగళాలో ఓ తోటమాలి వున్నాడు. బాహ్యంగా అతడు బాగా చిక్కిపోయి అస్థిపంజరంలా వుండేవాడు. అయితే అతని హృదయం మాత్రం చాల గట్టిది. భగవంతుని యెడల అద్వితీయమైన, కల్తీలేని ప్రేమ కలిగి వుండేవాడు. అతడు నిత్యం ఉదయం నాలుగు గంటలకే లేచేవాడు. ఆరు బయట గడగడలాడించే చలిలోకూడ, తన విరిగిన కుక్కిమంచంలో కూర్చొని "రామ రామ సీతారామ్" అని గంటల తరబడి నామం చేసేవాడు. ఋతువులు మారినా తన అలవాటు మారేదికాదు.

ఇతనిని గురించి, బాబా తన మిత్రులకు చెపుతూ "ఈ వృద్ధుడు తనకున్న కొద్దిదానితో తృప్తి చెందాడు. తన ధ్యానంలో అతడు ఏకోన్ముఖుడై నిమగ్నమైనాడు. అతడు కాషాయ బట్టలు ధరించకున్నా నిజమైన సాధువు" అన్నారు బాబా. గోహెర్‌ని పిలిచి ఆ తోటమాలికి ఏమన్నా కావాలేమో అడిగి రమ్మన్నారు.

గోహెర్ అతనిని కలవగా, "అమ్మా! దేముడు చల్లగా వుండాలి. నాకేమి అక్కర్లేదు. నాక్కావలసినవన్నీ "టాకూర్జీ" యిస్తూనేవున్నారు" అన్నాడు. టాకూర్జీ అంటే బంగళా యజమాని కాబోలనుకొని, "ఆయన ఎంత మంచివాడోకదా," అనుకుంది గోహెర్. తోటమాలి వినయానికి బాబా ముగ్ధులై మళ్ళీ

గోహార్‌ని పంపి అతనికి నిజంగా ఏమైనా కావాలేమో కనుక్కొని రమ్మన్నారు.

అప్పుడాతడు హృదయాన్నే గడగడలాడించే చలిలో నూతి నుండి నీరు తోడి స్నానం చేస్తున్నాడు. చిన్న గావంచా కట్టుకొని వున్నాడు. అదే పిండుకొని మళ్ళీ కట్టుకొని, "రామనామం" తన్మయత్వంతో చేస్తున్నాడు. గోహార్ ఏమైనా కావాలేమోనని బలవంతం చేయగా, "ఒక అగ్గిపెట్టె యిప్పించ"మని అడిగాడు. ఏమి వింత కోరిక?

ఏమైతేనేమి, ప్రియతముడు తన ప్రేమ వనంలోని పుష్పాన్ని గుర్తించారు. ఉచితరీతిని తన ప్రేమికుని ఆశీర్వదించారు. ఆ తోటమాలిని తన గదికి పిలిపించి వున్న దుప్పటి ఒకటి బహూకరించారు. దాని నాతడు ఆనందంతో పుచ్చుకుని "ఇది భగవంతుని ప్రేమ బహుమానం" అంటూ తన అదృష్టానికి మురిసిపోయాడు. బాబాను భగవంతునిగా గుర్తించాడో లేదో అతనికే తెలియాలి.

## తోడూ - నీడ

సారనాథ్‌లో దాదాపు పది రోజు లున్నారు. రోజూ ఉదయం మిత్రులతో సమావేశమై చర్చలు జరిపేవారు. ఒకరోజు సమావేశంలో మిత్రు లొకరు, "బాబా! నవజీవనంలో క్రొత్తవారి నెవరినైన జేర్చుకోవచ్చునా?" అని ప్రశ్న వేసాడు.

అందుకు మరో మిత్రుడు "అలా కొత్తవారిని జేర్చుకొంటే, యీ నవజీవనపు ఆనందమే నాశనమౌతుంద"న్నాడు.

అప్పుడు బాబా అందుకొని "ఈ నవజీవనపు ప్రాముఖ్యత మననుండి రాలేదు. దాని నెవరు జీవింపచేస్తారో వారి దా ప్రాముఖ్యత. నియమాలను పాటించుటలో మనం అపజయం పొందితే, మనమీ నవజీవనాన్ని అప్రదిష్టపరచినట్లే. అతడు క్రొత్తవాడైనప్పటికీ నూటికి నూరుపాళ్ళు నవజీవనాన్ని గౌరవించి విధేయతతో నియమాలు పాటిస్తే, నవజీవనానికి కట్టుబడి వున్నట్లే" అన్నారు. ఈ సమావేశం చివరలో, నవజీవనంలో ఎవరినైనా క్రొత్తవారిని చేర్చుకొనుటకు బాబా అంగీకరించారు.

దాని ఫలితంగానే డెహెరాడూన్ చేరాక, కైకోబాద్‌ని, పెండూ సోదరి నజాని నవజీవనంలో చేర్చుకున్నారు.

మరో రోజు సమావేశంలో తమ పాదయాత్ర సారనాథ్ నుండి హరిద్వార్‌కు సాగాలని నిశ్చయించారు. బరువైన సామాన్లన్నీ రైల్లో హరిద్వార్‌కు పంపాలని నిశ్చయించారు. అయితే రైలు ఖర్చులకు పైకం ప్రశ్నైంది. డబ్బెక్కడిది? అందుకే బాబా శిష్యులందరి గడియారాలు అమ్మేసి డబ్బు తెమ్మన్నారు. డాన్‌కిన్, పెండూ, ఆదీలు మాత్రం బాహ్య ప్రపంచంలో కార్యకలాపాలు నిర్వర్తించవలసి వున్నందున తమ గడియారాలు వుంచుకోమని ఆజ్ఞాపించారు.

సారనాథ్ వదలి వెళ్ళేముందు డా॥ నాథ్ గారికి, అతని కుటుంబానికి, డా॥ ఖేర్‌కు ఆయన తలిదండ్రులకు దర్శన మిచ్చెద

నని, వచ్చి దర్శించుకు వెళ్ళమని కబురంపారు. ఈవార్త విన్న తరువాత వారి ఆనందానికి అవధులు లేవు. వారంతా ఆగమేఘాలలో వచ్చి, బృందాన్ని, బృంద నాయకుని తనివిదీరా దర్శించుకున్నారు. బాబా దర్శనభాగ్యం పొందగానే, ఆ బృందనాయకుడెవరో పోల్చుకున్నారు.

ఆ సమయంలో డా॥ నాథ్, తనకు కాశీలో వుండగా యిచ్చిన, బృందంవారి దుస్తులు, వాచీలు వగైరాలన్నీ తిరిగి సమర్పించుకోవాలని ప్రయత్నించాడు. తమ కానుకలుగా ఇచ్చిన వాటిని మళ్ళీ తిరిగి యివ్వవద్దని బాబా వారితో చెప్పారు. అయితే తన జ్ఞాపక చిహ్నంగా ఒక చేతిగడియారం యివ్వమని అడిగారు. తన దగ్గరవున్న గడియారాలలో తన చేతికి వచ్చిన దానిని ఒకటి తీసి, మిత్రులొకరికి యిచ్చారు. బృందం తాలూకు బట్టలన్నీ యిస్త్రీచేసి మూటలు కట్టి తెచ్చారు. అయితే బాబా ఇవ్వవద్దన్నందున, మళ్ళీ తీసుకొని తిరిగి కాశీ వెళ్ళిపోయారు నాథ్ తదితరులు.

## మూఢ భక్తి

ఒకరోజున, హాస్యానికి ఘనీని పిలిచి ప్రతిరోజూ ఉదయం తాను మిత్రుల గదిలోనికి రాగానే పఠాన్ పద్ధతిలో యీవిధంగా శుభాకాంక్ష లందజేయాలని ఆదేశించారు. యిలా అభినందించే పదాలలో విచిత్రమేమంటే, ప్రతి పదం చివర, హై, మై, తై,

వగ్గైరా వుండి వినేవారి మనసులో ఏవైనా అసౌకర్యపు ఆలోచన లుంచే మాయమయ్యేవి.

1. స్త్రాడై మాషమ్ 2. ఖ్వార్డెమాషై 3. జోదయ్
4. తగ్గమ్ 5. ఖుష్ హాలమ్ 6. కాలే మాషమ్
7. సలాహుమ్.

మళ్ళీ రాత్రి పరుండే సమయంలో "గుడ్‌నైట్" అని చెపుతూ ఉర్దూలో మరోపాట పాడమని ఆదేశించారు.

"పాతజీవితపురోజులు ఎన్ని రకాల గడిచాయి!
ఎలాగో నేడుకూడా గడిచిపోయిందిలే!
రేపు గురించి చింతెవరికి? తరువాత ఏం జరుగునో
అని చింతించం!"

కాశీ వదలిం తర్వాత నిత్యం గడిపే భిక్షుక వృత్తి అతి సహజంగా జరగాలని బాబా నిర్దేశించారు. అందుకోసం తగు శిక్షణ యిచ్చారు. భిక్షాటనలో ముఖ్యంగా అనుసరించవలసిన పద్ధతులు నిర్దేశించారు.

చెప్పులు లేకుండా నడచి భిక్ష చేయాలి. తెల్ల బారుగౌను ధరించాలి. అక్షయపాత్ర ఒక చేతిలో, చంకలో జోలె వుండాలి. ఈ జోలెలో వివిధ పదార్థాలు ఉండుటకు వీలుగా అనేక అరలు వుండాలి. భిక్షాటనలో స్త్రీలను తాకరాదు. స్త్రీలనుండి, పురుషుల నుండి కూడ భిక్ష నర్థించవచ్చును. మిఠాయి భాండారాలలోను, నపుంసకులవద్ద భిక్ష కోరరాదు. బాబా ఆజ్ఞాపించి ఎంపికచేసిన

విధంగా, ఇద్దరేసి జట్లుగా భిక్షకై వెళ్ళాలి. "ప్రేమతో భిక్ష పెట్టండి" అని అడగాలి. భిక్ష ఒకే యింటిదగ్గర అడగాలి. ఆ యింటివారు లేదంటే మరో యింటికి వెళ్ళాలి. కొద్దిగా పెట్టారా? ఎక్కువగా పెట్టారా? అని చూడకూడదు. అలా భిక్ష పెట్టగానే పరుగునవచ్చి బాబా బృందాన్ని కలిసి, తెచ్చినభిక్ష బాబాకు పెడితే, ఆయన తన స్వహస్తాలతో అందరికి పంచుతారు. ఇవీ భిక్షాటనలో పాటించవలసిన నియమాలు.

# నైతిక ధర్మం

రోజూ వుదయం చీకటితో లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, 5 గంటలకల్లా టీ త్రాగాలి. అది శీతాకాలం అగుటవలన చలి విపరీతంగా వుంది. నియమం ప్రకారం శిష్యులంతా కేవలం ఒక చపాతీ, కప్పు టీ కోసం గడగడలాడించే చలిలో లేవాల్సివస్తోంది. పోనీ అలా లేచి, మతపరమైన ప్రార్థనలు వగైరాలేమీ పాటించ వలసిన అవసరం లేదు. స్నానం చేయమనలేదు. ధ్యానం చేయమనలేదు. ఏ పనీ చేయమనలేదు. కాలకృత్యాలు తీర్చు కొని టీ త్రాగమన్నారు.

చలిలో చేసే యీ పనికి, మిత్రులంతా టీ వేళ మారిస్తే బాగుండదా? అనుకున్నారు. ఒకరోజు రాత్రి పరుండబోవు సమయంలో డా॥ ఘనీ హాస్య ధోరణిలో "ఓస్! నవజీవన మంటే యింతేకదా! సమయం కాని సమయంలో చేయవలసిన

నిత్యకృత్యం చేయడమేగా? ఏమి ప్రతిబంధకం లేనిచోట కష్టాలు కొనితెచ్చుకోవటం, సాఫీగా సాగిపోయే సన్నివేశంలో హఠాత్తుగా కుదుపు కలిగించుట ఇలాంటివన్నీ కలిపి అనుభవించే జీవనమే నవజీవనమని మేము పిలుస్తున్నాం" అని మిత్రులతో అంటుండగా, వేరేగదిలో వున్న బాబా ఆ వ్యాఖ్యానాన్ని విన్నారు. వెంటనే ఘనీని పిలిపించి తన వ్యాఖ్యలను విశదీకరించమని ఆదేశించారు.

## నిరసన ధోరణి

నైరాశ్యంతోవున్న ఘనీ ఎంతో ధైర్యంతో యిలా వివరించాడు. "చూడు బాబా! ఎక్కడా ఈ భూప్రపంచంలో లేనివిధంగా మేము రోజూ చీకటితో తీసుకొనే టి నీటి సేవనం. ఉదయం 5 గంటలకు టీ త్రాగాలంటే మేము 4 గంటలకే లేవాలి. కాలకృత్యాలు తీర్చుకొని తయారవ్వాలికదా! ప్రొద్దుటే లేవగానే మే మేమీ మతపరమైన ధర్మాలు పాటించాల్సిన పనిలేదు. ఓ హారతి లేదు. సంధ్య లేదు. పూజలేదు. కస్తీ సద్రా లేదు. నమాజులేదు. అయినా, కొరుక్కుతినే యీ చలిలో మేమంతా పక్కలమీదనుండి లేవాలి. వణుక్కుంటూ, ముక్కుతూ, మూలుగుతూ, తెల్లవారగట్ల గం. 4-30 లకే లేచి కేవలం కప్పు టీ తాగి ఆనందించుటకు, లేదా అదీ దొరికితే ఓ చపాతీముక్క నీవు పెడితే, గం. 5-00 ల కల్లా తిని ఆనందించుటకు మేము నానా అవస్థలు పడాల్సివుందికదా!" అన్నాడు.

ఘనీ అలా తన వ్యాఖ్యను వివరిస్తున్నప్పుడు, తక్కిన శిష్యులంతా ఒక్కసారి ఘొల్లున నవ్వారు. బాబా కూడ పైకి అందరితోపాటు నవ్వులో శృతి కలిపారు. పైకి ఆనందంగా వున్నట్లు కనబడ్డారు. మామూలు ప్రకారం రాత్రి పరుండబోవు సమయంలో అందరికీ వీడ్కోలు చెపుతూ, బైదులును పిలిచి యీరోజు వుదయం టీ మామూలుకంటే 15 నిమిషాలు ముందుగా 4-45 ని॥ లకే అందరికీ సప్లయి చేయమని, వూహించనివిధంగా ఆదేశించారు.

అది నవంబరు 23-వ తేదీ, ఆరోజు వుదయం అందరూ ఆశ్చర్యపోతూవుండగా గతరాత్రి ఘనీ చేసిన వ్యాఖ్యను గురించి చెపుతూ, ఆ వ్యాఖ్య ననుసరించే ఈ వుదయం మామూలుకు భిన్నంగా 15 ని. ముందే టీ త్రాగించాను. గత రాత్రంతా నాకు నిద్రలేదు. ఘనీ వ్యాఖ్యానం విన్నవారంతా విరగబడి నవ్వుట, నన్ను ఆలోచనలకు దించింది. నాకేమనిపించిందంటే, టీ సరఫరా చేయబడే సమయం గురించి, ఘనీ వ్యాఖ్యానించిన తీరును మిత్రులంతా ఒక్కుమ్మడిగా నవ్వి అతని-వ్యాఖ్యను బలపరిచినట్లు అనిపించింది. "

అయితే మరి మీరంతా హాస్యంగా తీసుకున్నారో, వ్యంగ్యముగా తీసుకున్నారో, ఏవిధంగానైనా తీసుకోవచ్చును. మరైతే అదంతా హాస్యానికైతే నేను మీతోపాటు హాస్యంగా తీసుకొనక పోవుటతో నాది తప్పు కావచ్చును. మరి, అది తీవ్రమైన వ్యాఖ్యగా పరిగణించినప్పుడు, మీరంతా వుదయం "టీ" త్రాగాలనే ఆజ్ఞ

అనవసరమని అర్ధం లేనిదని అనుకుంటే, అప్పుడు అది విమర్శిం చుటయే కాక, యీ నవజీవన నియమాలలో అత్యంత ప్రధాన నియమోల్లంఘనే కాగలదు." అని బాబా సుదీర్ఘ ప్రకటన చేశారు.

డా॥ ఘనీయొక్క విపర్శను మిత్రులంతా సమర్ధించినట్లు ప్రవర్తించినందువలన బాబాకు ఆ రాత్రంతా నిద్రలేకుండా పోయి నది. అందుకే, తెల్లారగానే బాబా మిత్రులందరికి, తమ భావాలు విడమర్చి చెప్పే అవకాశం యిచ్చారు. బాబా ఆజ్ఞలు తేలికగా అర్ధం చేసుకొనే వీలుకానీ, అవకాశంకానీ లేకున్నప్పటికీ, అట్టి ఆజ్ఞ అర్ధం లేనిదని, అనవసరమని తలచుట అవివేకమే అవుతుం దని, మిత్రులంతా ముక్త కంఠంతో పలికారు.

మిత్రులిచ్చిన యీ హామీ, ఆ సమయంలో ఏర్పడివున్న తీవ్రతను చల్లార్చింది. బాబా ఆనందించారు. తాను, గతరాత్రి జరిగిన కథనంతటినీ హాస్యంక్రింద కొట్టిపారవేశారు. అయితే తోటి మిత్రుడు ఘనీ చేసిన వ్యాఖ్యను అనుమానించి, మిత్రులకు తనయెడల వున్న విధేయతను పొరపాటున సంశయించినందుకు శిక్షగా యిరువురు మిత్రులను చెంతకు పిలిచి, తన రెండు చెవు లను గట్టిగా నులిమి పిండించుకున్నారు.

అప్పుడు సంతృప్తిని ప్రకటిస్తూ బాబా "ఒక రాత్రంతా నాకు నిద్ర లేకున్న ఫలితం, ఇప్పుడు మిత్రులు యిచ్చిన వివరణ విన్నప్పుడు నాలో కలిగిన ఆనందంతో సరిసమాన విలువ కలిగి

పడి. నిద్రలేని ఒకరాత్రి పడిన వ్యధ, మీరిచ్చిన వివరణతో కలిగిన ఆనందంతో సరిపోయింది ” అన్నారు.

ఈ సంఘటనవలన, మనం గ్రహించవలసిం దేమనగా, ఒక సద్గురువు యిచ్చే అనూహ్యమగు ఆజ్ఞలను, విధేయతతో పాటించి భరించ కలుగువారు, ఆధ్యాత్మిక క్రమశిక్షణలో అత్యున్నత స్థానంలో వుండగలుగుదురు. బాబా యిచ్చే ఆజ్ఞలలో ఏదేని అర్థం వుండే అవసరం తెలుసుకొనవలెనంటే, విధేయత, విలువలతోపాటు ఆధ్యాత్మిక దృష్టిలోకూడ అది తన ప్రత్యేకతను కలిగివుంటుంది. విడువకుండా దైవాన్ని జ్ఞాపకం పెట్టుకొనుటకు అట్టి ఆజ్ఞలు సహాయకారులౌతాయి.

## న్యాయ నిర్ణేత

విధేయత అంటే, ఒకరు చేయమన్నది చేయుట. ఒక సద్గురువుతో సంబంధం వున్నవారు గురువాజ్ఞకు ఎదురు చెప్పుట అనే అవకాశం లేనేలేదు. తిరుగులేని విధేయత అనుక్షణం అవుసరం. సద్గురువు పదసేవలో, ఆయన ప్రేమలో ప్రతివారు తప్పనిసరిగా, ఆపాదమస్తక శూన్యులై సంచరించాలి. అందుకే బాబా “ నేను చెప్పినట్లు చేయండి ! ” అనేవారు। ఇది వినుటకు చాలా సులభంగా కనబడుతుంది. ఆచరణలో ఎంత కష్టమో పై వుదంతంలో గ్రహించవచ్చును.

నవజీవనంలో పాల్గొన్న శిష్యులంతా ప్రమాణంతో ప్రతిజ్ఞ చేసిన ముఖ్యమైన షరతేమంటే ఏ ఒక్కరూ కూడ ఎట్టి పరిస్థితు

లలోను కోపం తెచ్చుకోకూడదు అని. ఒకరోజున బాబాయే స్వయంగా తన అదుపు కోల్పోయి, చేసిన ప్రతిజ్ఞను జవదాటి కోపం తెచ్చుకున్నారు. మరి అలా తమ ప్రతిజ్ఞను పాటించ నందుకు శిక్షగా తనతోవున్న మిత్రులందరినీ వరుసగా, ఒక్కొక్క రినే వచ్చి, బలంకొలదీ తనను లాగి తన్నమన్నారు. నవజీవ నంలో మరో నియమం, బాబా యిచ్చే ఆజ్ఞ పాటించుటకదా। విధేయతతో మరేప్రశ్న వేయక,వినయంతో ఆచరించాలి.

నవజీవనంలో బాబా అవతారునిగా కాక, కేవలం మిత్రుని గానే వుంటానన్నారు. అన్నివిధాల ఆయన మిత్రుడే అయినప్ప టికీ, తోటి మిత్రులు ఆయన ఆజ్ఞలకు బద్ధులై, ఆయనను తమ పెద్దన్నయ్యగా చూచుకుంటూ ఆయన ఆజ్ఞలకు విధేయులుగా మసులుకుంటున్నారు. ఆమాదిరిగా బాబా తన్నమనగానే విధేయ తతో ఆజ్ఞను పాటించారు.

కాగా చివరిలో ఘనీ వంతు వచ్చింది. అతడు చాల తీవ్రంగా బాబాను ఎదుర్కొని బలంగా తన్నేందుకు వుద్యుక్తు డైనాడు. కానీ చాల తేలికగా కాలు ఆనించి తీసివేశాడు. "గట్టిగా తన్నేప్రయత్నం చేసి, తేలికగా తగిలించి వూరుకున్నా వేమ"ని బాబా ప్రశ్నించారు. అందుకు ఘనీ బదులిస్తూ "బాబా, నవజీవనంలో యిప్పటివరకూ ఎదుర్కొన్న కష్టాల మూలంగా, నాలో అణగివున్న కోపం పెల్లుబికి, యీ అవకాశంద్వారా కసి తీర్చుకోవాలని, అంత బలంగా కాలు ఎత్తాను. అయితే తీరా కాలు నీదగ్గరకు వచ్చేసరికి, నీలో నా చిన్ననాటి మిత్రుడు కనపడే

సరికి అలా తన్నలేక నెమ్మదిగా కాలానించి, నీ ఆజ్ఞ పాటించాను" అంటాడు డా॥ ఘనీ.

## కాలి నడకన శివపూరుం ప్రయాణం

డిశంబరు 12-వ తేదీన బాబా, బృందంతో సారనాథ్ వదలి జాన్‌పూర్ వైపు కాలి నడకన పయనమైనారు. సారనాథ్ నుండి జాన్‌పూర్ షుమారు 60 కిలోమీటర్లు దూరంవుంది. ఇది దాదాపు జిప్సీ జీవితంలాంటిది. "నిన్న గడిచిపోయింది ఎలాగో! నేడుకూడ గడిచింది అలానే! మరి రేపు గురించిన చింత ఎవరికి? రేపుగూడ గడిచిపోతుందిలే!" అనే పాట రోజూ పాడిస్తూ తగు శిక్షణయిచ్చే భాగం యిది.

ఒంటె (భోలారాం) మెళ్ళో పెద్ద పర్షియన్ గంట కట్టారు. బైదుల్ దాని సారధి. గుస్తాద్‌జీ, డా॥ ఘనీ గాడిదల సంరక్షకులు. నీలూ, అలోబాలు ఆవులవంతు. కొందరు బళ్లు తోలుకుంటూ, కొందరు జంతువులను తోలుకుంటూ సూర్యోదయం కాగానే నడక ప్రారంభించేవారు. బాబా, యీరుచ్‌లు ముందు నడిస్తే వారివెనుక నలుగురు స్త్రీలు నడిచేవారు. వారి వెనుక కొంచం దూరంలో, తెల్లగౌను, పచ్చ తలపాగా ధరించిన శిష్యులు, జంతువులు, బళ్ళ సరంజామాతో అనుసరించేవారు.

ముందు బాబా, స్త్రీలను బ్లూ గౌనులు, బూడిదరంగు తల పాగాలు, కాలినడక సమయాల్లో ధరించమన్నారు. కానీ మళ్ళీ

ఈ ఆజ్ఞను మార్చి, పాదయాత్ర ప్రారంభించిన మొదటిరోజున మాత్రం బ్లూరంగు చీరలు ధరించమని ఆదేశించారు.

మొదటి రోజున అలా కొంతదూరం నడక సాగింతర్వాత, బాబాకు కాలకృత్యం తీర్చుకోవాల్సి వచ్చింది. దారిలో మరు గైన ప్రదేశం ఏదీ కనపడలేదు. అందుచేత యీరుచ్ బాబాను రోడ్డు ప్రక్కకు కొంచందూరం తీసుకువెళ్ళి, మళ్ళీ రోడ్డుమీదకు తీసుకు వచ్చాడు.

## రంగుల పుష్పగుచ్ఛం

రోడ్డువెంట అట్టహాసంతో పయనిస్తున్న బృందాన్నిచూచే ప్రజలకు, అదంతా ఏదో ఆధ్యాత్మిక, లేదా ఒక మతపరమైన, దృశ్యంలా గోచరించేది. మిత్రులు ధరించిన దుస్తుల వేషధారణ, ముఖ్యంగా తెల్లటి బారుగౌను ( కఫ్నీ ) పచ్చటి తలపాగా, తెల్ల బూట్లు, యివి అందరినీ ఆకర్షించేవి. జంతువులేమో, మిత్రు లకు చాల కష్టాలు కలిగించేవి. ముఖ్యంగా రెండావులు, రెండు గాడిదలు బాగా ఏడిపించేవి.

గాడిదలను గుస్తాద్‌జీ, డా॥ డాన్‌కిన్‌లు అజమాయిషీ చేసేవారు. నిజంగా అది ఎంతో కష్టమైనపని. నీలూ మరియు అలోబాలు ఆవులను సాకేవారు. ఈ కాలినడక ప్రయాణంలో మందీ మార్బలం, జంతుజాలంతో కూడిన అట్టహాసం, వేర్వేరు మతములకు సంబంధించిన వ్యక్తులతో కూడిన బృందం చూచే

సరికి పోలీసు ఆఫీసర్లు ఆలోచనలోపడి అనుమానించుట జరిగింది. కొందరీ బృందాన్ని అనుసరించి, యీరుచ్‌ని ప్రశ్నించడం కూడ జరిగింది. మీ రెవరు? ఎక్కడికి వెళుతున్నారు? మీ ధ్యేయ మేమిటి? పటాటోపంతో కూడిన ఈ అట్టహాసం ఏమిటి? అంటూ అనేక ప్రశ్నలు వేశాడు ఒక పోలీసాఫీసరు.

ఈరుచ్ మాత్రం, కడు చాకచక్యంతో ఆ అధికారికి సంతృప్తికరమైన జవాబులు చెప్పాడు. మా బృందమంతా హరిద్వార్‌లో జరుగబోయే కుంభమేళాకు వెళుతున్నాము అనిచెప్పాడు. అప్పటి రాజకీయ పరిస్థితులరీత్యా పోలీసువారికి అనేకమందిమీద విభిన్నమైన రిపోర్టులు వచ్చి యున్నందున, యీ బృందాన్ని ప్రభుత్వ వ్యతిరేక రాజకీయముఠా యేమోనని అనుమానించి మరో ప్రశ్న వేశాడు. యింతకుముందు మీతో ఒకాయన నడుస్తున్నాడుకదా! ఆయన ఏడి అని అడిగాడు.

ఆయన కాలకృత్యం తీర్చుకోవడానికి రోడ్డుకు అవతల కొంచం దూరం వెళ్ళారని నిజం చెప్పాడు. అందుకా అధికారి యీరుచ్ మాటలమీద విశ్వాసముంచి, తనవిధి తాను నిర్వర్తించావనే తృప్తితో బాబా వచ్చేలోపలే వెళ్ళిపోయాడు. పాపం, కొద్ది నిమిషాలుపాటు ఆగలేక తను ఎంతటి విలువైన అవకాశాన్ని జారవిడుచుకున్నాడోకదా! అవతారునితో అనుబంధం ఎలా వుంటుందో చూడండి! ఆయనతో అతి సన్నిహితంగావున్నా ఆయన దర్శనం పొందలేదు. మరి ఎంత దూరానవున్నా, సమ

యానికి దైవ మానవుని సన్నిధిచేరి దర్శనం చేసుకుంటాడు. అవతారుని చర్యలు ఊహించలేము.

ప్రథమ మకాం శివపూరులో. ఆ పట్టణ పొలిమేరలో బాబా స్త్రీలతోపాటు వెనుక వస్తున్న పురుషులకోసరం ఆగారు. కొంచం సేపట్లో బృందమంతా తమతమ మార్గాలంతో బాబాను చేరు కున్నారు. నీలూమాత్రం యింకా రాలేదు. అతను ఆవుదూడ లను సాకుతున్నాడు.

## నీలూ పోషణలో ఆవుదూడ

డా॥ నీలూకు పాలంటే యిష్టం. మరి ఆ యిష్టమే అతని కష్టాలకు హేతువైంది. సారనాథ్‌లో వుండగా బాబా ఆతడితో అతనికి పాలంటే యిష్టం కనుక, పాలిచ్చే ఆవును సాకమని చెప్పారు. దానికో చిన్న దూడకూడ వుంది. ఒక కిలోమీటరు నడక సాగేసరికి దూడ, తల్లి ఆవుతో నడవలేకపోయింది. నడవలేక నేలమీద పడిపోవుట మొదలిడింది. అందుచేత, పాపం నీలు దానిని తన భుజాలమీద కొంతదూరం మోయాల్సివచ్చింది.

ఫలితంగా అతడు తక్కిన బృందంతో వెనుకపడిపోయాడు. బృందమంతా పట్టణంలోనికి వెళ్ళిపోయారు. నీలూమాత్రం వెనుక పడి నడుస్తుంటే, అంతలోనే చెక్‌పోష్టు వచ్చింది. దూడకు ఆశీలు ( మునిసిపల్ టాక్సు ) కట్టమని అధికారులు జులుం చేశారు. అక్కడ గుమాస్తా నీలూ ఆదూడను అమ్మకానికి తీసు కెళుతున్నా డనుకున్నాడు.

నవజీవన నిబంధనల ప్రకారం, అతడు తనతో ఒక్క పైసాకూడ తీసుకువెళ్ళకూడదు. కనుక అతనివద్ద పైకం ఏమీ లేదు. తాను హరిద్వార్ వెళుతున్న యాత్రికుడనని, బృందం ముందు వెళ్ళారని, దూడ నడవలేకపోయినందున వెనుకపడ్డానని ఎంతచెప్పినా ఆ క్లర్కు వినిపించుకోలేదు. ఎట్టకేలకు ఆ అధికారిని వప్పించి బయటపడి చివరకు బృందాన్ని చేరుకున్నాడు.

ఆరోజు సాయంత్రం జంతువులురీత్యా శిష్యులు పడుతున్న కష్టాలు బాబా దృష్టికిరాగా, కొన్ని జంతువులను అమ్మివేయమని ఆదేశించారు. తక్కినవాటిని రైలుపై హరిద్వార్ పంపమని ఆదేశించారు.

## జంతు ప్రదర్శన

ఉత్తరాభిముఖులై బాబా బృందంతో మొరాదాబాదుపైపు ప్రయాణం సాగిస్తున్నారు. కాలినడకన దారిలో భిక్షాటన సాగిస్తూ పోగాపోగా నాలుగు రోజులకు "జాన్‌పూరు" అనే పట్టణం చేరారు. ఆరోజులలో బృందమంతా జిప్సీ జీవితంయొక్క ఆరంభ రుచి అనుభవించారు. అంతటి విపరీత చలి వున్నప్పటికీ మిత్రులు రాత్రులందు ఆరుబయట, చెట్లక్రింద విశ్రమించేవారు. భిక్షాటనలో ఏది లభ్యమైతే అది తలాకాస్త తిని తృప్తిపడేవారు.

జాన్‌పూర్ చేరేముందు షివపూరు, బాచిత్‌పూరు, రహతాలలో రాత్రిపూట విడిది చేశారు. మామూలుగా వారి ప్రయాణము సూర్యోదయంతో ఆరంభమై మధ్యాహ్నంవరకూ కొన

సాగేది. దారివెంట ఎండు పుల్లలు దొరికితే ఏరుకొనేవారు. ఆగినచోటల్లా, పెండూ పశువుల మేత కొరకు ప్రయత్నించేవాడు. సమీపంలో వుండే జలాశయంచెంత వాటికి నీళ్ళు పెట్టేవాడు.

కాకాబారియా వంటపనిలో నిమగ్నమై వుండేవాడు. గ్రామాలలో మిత్రులు భిక్షాటన చేసేవారు. బస్తీలలోని వారికంటే గ్రామీణులే కొంచెం అతిథి, అభ్యాగతి అనే వుద్దేశ్యంతో భిక్ష పెట్టడంలో చొరవ చూపేవారు. భిక్షలో పిండికానీ, తదితర ముడి పదార్థాలు వస్తే దారిలో ఏరివుంచిన పుల్లలతో కాకాబారియా వంట చేసేవాడు.

బాబా విశ్రాంతి కొరకు రెండు మడతల డేరా వుండేది. దాని రెండు చివరలు 'కారవాన్'కు కట్టేవారు రాత్రిలందు కారవాన్‌లో స్త్రీలు విశ్రమించేవారు. అన్నాజాకాల్ కాపల కాసేవాడు.

మండలిలో అన్నాను అన్నా 104 అంటారు. అతనికి ఆంగ్లభాష సరిగా రాదు. 1920 లో అతనికి చాల జబ్బు చేసింది. 104 డిగ్రీలజ్వరం తగ్గకుండా వుండేది. అప్పుడు కొందరు బాబా ప్రేమికులు అతనిని చూద్దామని గదిలోకి వెళ్ళగా, వెళ్ళిన ప్రతివారితో అర్ధనిమీలిత నేత్రుడై "104" అనేవాడు. బాబా కూడ స్వయంగా అతనిని చూదామని వెళ్ళగా ఆయనతోకూడ "బాబా! 104" అన్నాడు. అతని వుద్దేశ్యంలో 104 డిగ్రీలజ్వర ముందని చెప్పాలి. కానీ వూరికే 104 అనేవాడు. అప్పటినుండి

అతనిపేరు "అన్నా 104" గా మిగిలిపోయింది. అది బాబా అతనికి పెట్టిన మారుపేరు.

ఉదయం 4 గంటలకే బాబా నిద్రలేచి, కారవాన్ తలుపు తట్టేవారు. ఆడవాళ్ళు లేచి బండి దిగి గబగబా కాలకృత్యాలు తీర్చుకొని, బాబా షేవింగుకు, స్నానానికి వేడినీళ్ళు కాచి సిద్ధం చేసేవారు. తరువాత బృందమంతా వేడివేడి టీ ఒకకప్పు తాగే వారు. భిక్షలోగాని చపాతీ లేక జొన్న రొట్టెలు ఏవైనావస్తే అవి అందరికీ తలాఒకముక్క పెట్టేవారు.

'టీ' కి కావలసిన పాలు, వారివద్దవున్న ఆవుపాలే పాటిల్ తీస్తే కాకా వారియా టీ తయారు చేసేవాడు. మెహెరా బాబాకు "టీ" తీసుకువెళ్ళి యిచ్చేది. ఆ తరువాత ఫలహారం అంతా తినేవారు. చలి వణికిస్తున్నా, క్షణం ఆలస్యం చేయకుండా, వరుసక్రమంలో పనులన్నీ జరిగిపోయేవి. మిత్రులంతా అంత చలిలోను, స్నానాదులు పూర్తిచేసుకొని మళ్ళీ కాలినడకకు సిద్ధ మయ్యేవారు.

బాబా పురుషులవద్దకు వెళ్ళి, వాళ్ళను పరామర్శించి, క్షేమాలు తెలుసుకొనేవారు. బళ్ళమీద మండలి సామాన్లన్నీ వేసేవారు. వాళ్ళ బెడ్డింగులు, పాత్రసామానులు, హరికేన్ లాంతర్లు, గడ్డీ గాదం సమస్తం బళ్ళమీద సర్దేవారు. మిత్రు లంతా కాలినడకన నడిచేవారు.

ఆగిన ప్రతిచోటా, జనం గుంపులు గుంపులుగా పోగయ్యే, వారు. వీళ్ళ మందీ మార్బలాన్ని వింతగా చూస్తూ, ఆడ మగ్గ్య

పిన్నా పెద్దా తేడా లేకుండా చుట్టుముట్టేవారు. పాపం! ఎప్పుడూ ఏకాంతంగా గడుపుటకు అలవాటుపడిన స్త్రీలకు యీ సందర్శన కొంత చికాకు కలిగించేది.

వాళ్ళు ధరించిన దుస్తులు చూచి, కొందరు, వీళ్ళంతా పాకిస్తానునుండి వలస వచ్చిన కాందిశీకులేమో ననుకొనేవారు. మరి కొందరు వీరేదైనా సర్కసు కంపెనీకి చెందినవారేమో ననుకొనేవారు. ఇతర జంతువులతో ఈ గాడిద లెందుకని మరి కొందరి సందేహం.

నవజీవనంలో జరిగిన జంతు ప్రదర్శన ఫలితం గురించి, కొన్ని సంవత్సరాలు గడిచిన తర్వాత కాకాజారియా యీవిధంగా వ్యాఖ్యానించాడు. "వాళ్ళతో జంతువులు తీసుకువెళ్ళుట జరిగి నప్పటికీ బాబా, తన పూర్వ అవతారాలలో జంతులోకానికి చేసిన మేలుకంటే, యీ సమయంలో అత్యున్నత, సరిక్రొత్త కార్య క్రమమేదో చేశారు. తెల్లగుర్రం, జోరాష్ట్రియు చేసిన కార్య క్రమానికి ప్రతిబింబం. కాగా ఆవులు కృష్ణుని కార్యక్రమానికి ప్రతీకలు. ఆధ్యాత్మిక కుదుపు కలిగించుటకై మధ్యేమార్గంగా జీససు వుపయోగించిన జంతువులు గాడిదలుకాగా, ఒంటె మహ మ్మదు చేసిన కార్యక్రమానికి సంబంధించినది.

## జాన్‌పూరు మకాం

జాన్‌పూరు పట్టణం ముల్లంగి దుంపలకు ప్రసిద్ధి. ఆ దుంపలు ఎంత లావుంటాయో తెలుసా? మన కాలి తొడలంత

లావుంటాయి. పెద్ద సొరకాయలవలె వుంటాయి. అవి ఎంత లావున్నా చాలసున్నితమైనవి. బారుగా, తెల్లగా, లావుగా వుండేవి. గుండ్రంగా వుండేవికావు. అక్కడ దొరికే వంకాయలు కూడ, ఒకేకాయ షుమారు ఒకటి రెండు కిలోలుకూడ తూగుతుంది.

అలా యీ బృందమంతా జాన్‌పూరు చేరేసరికి వారంతా ఆ మహాపట్టణ రాజవీధులన్నీ చుట్టిరావలసి వచ్చింది. పట్టణ వీధులగుండా వెళ్ళే సమయంలో పాపం, మిత్రబందం ఎన్నో కష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది. సరిగా అదే సమయానికి పాఠశాలలన్నీ మూసివేసేవేళ అగుటవలన బడులు వదిలేశారు. దురదృష్టవశాత్తు బాబా బృందం అదేరోడ్డుపై వెళ్ళవలసి వచ్చుట చేత, ఆపిల్లలు, ఈబృందంవారి వేషాలుచూచి, గేలిచేస్తూ అరుపులతో వారిని వెంబడించారు. పిల్లికూతలు, వెక్కిరింతలు తారస్థాయికి చేరాయి. "మీ రెవరు? ఎక్కడకు పోతున్నారు?" అని కొంతమంది ప్రశ్నించారు.

అయితే మిత్రులు ఏమాత్రం వుద్రేకం చెందలేదు. "మేమంతా ఉత్తరదేశయాత్ర చేస్తున్నా" మని నచ్చచెప్ప ప్రయత్నించారు. దానితో వారింకా రెచ్చిపోయి, హేళనతో, వ్యంగ్యంగా అరవడం మొదలుపెట్టారు. "అరే! బలేగమ్మత్తుగా వుందే! యాత్ర పోతున్నామని, గాడిదలు తీసుకెళుతున్నారు." అని కొందరంటే, గౌను లాగి ఒకడు, తలపాగా కొంగులాగి మరొకడు, "అదికాదురా! వీళ్ళెవరో నాటకాలవాళ్లో, సినిమా వాళ్లో అయివుంటారురా?" అని మరొకరు అంటూ గోలచేయ

మొదలిడినారు. పిల్లలు వాళ్ళ యిష్టమువచ్చినట్లు బృందంతో కోతికొమ్మచ్చు లాడారు.

వాళ్ళెంత అల్లరి పట్టిచ్చినా బృందంవా రెంతమాత్రిం పిల్లలను రెచ్చగొట్టక, మౌనంగా వారిని వదిలించుకొని, వూరికి దూరంగా వుండాలనే తలంపుతో, పట్టణపరిధి దాటి పొలిమేర చేరారు. వారి విడిది ఏర్పాట్లు చేయమని ఆదీ, బాబాదాసులను ముందుగానే పంపించినా, వసతి కుదరనందున విడిది ఏర్పాట్లు జరుగలేదు. ఫలితంగా పట్టణానికి ఒక కిలోమీటరు దూరంలో వున్న కైఖాగ్ అనే యిల్లు అద్దెకు తీసుకున్నారు.

పూర్వజీవనంలోవలెనే, నవజీవనంలో కూడ, బాబా, నిర్మించడం, పడకొట్టడం, ప్రణాళిక ఏర్పరచటం, పునఃప్రణాళికలు తయారుచేయటం వంటి అలవాటు మారలేదు. దైవ మానవునిచర్యలు తక్షణ ఫలితాలు యివ్వక, అవతారుడు నిమగ్నమై యున్న కార్యక్రమంలో అట్టి చర్యలు అంతర్గతమై యుండును.

జానపూరులో వుండగానే, ఒంటె, ఒంటెబండి, ఆవులను అమ్మమని ఆదేశించారు. కారవాన్ ఎడ్లబండి, రెండు గాడిదలను రైలులో హరిద్వారం పంపించారు. తెల్లగుర్రంమాత్రం వెంట వుంచుకున్నారు. ఈపూళ్ళనే మిత్రులకు మరో రహస్యం వెల్లడించారు. నవజీవనం ప్రారంభించబోయేముందు, బాబాను అనుసరించు అపునన్నవాళ్ళ నిమిత్తం ఒక్కొక్కరి పేర వెయ్యేసి రూపాయలు చొప్పున దాచివుంచమని మెహెర్‌జీ కార్యాలయాకు

వప్పగించారు. ఈ పైకాన్ని, తనతప్పు లేకున్నప్పటికీ ఏమిత్రు వైనా తిరిగి బాబా పూర్వజీవనంలోకి పంపిస్తే అట్టి మిత్రునికి యివ్వమని కూడ ఆదేశించారు.

ఆ విషయాన్ని మిత్రులతో సమావేశమై వున్నప్పుడు వెల్లడిస్తూ, మరి ఆపైకాన్ని మిత్రులంతా యిప్పుడు మనః పూర్వకం వదులుకొనుటకు యిష్టపడుతున్నారా? అని ప్రశ్నించారు చిరునవ్వు నవ్వుతూ. అవతారుడు ఏదైనా యివ్వవచ్చును లేదా తన ప్రియమైనవారినుండి తీసుకోనూవచ్చును. అది సరిసమాన మైన కృప.

శిష్యులంతా ముక్తకంఠంతో, తాము భౌతికంగా బాబా సమక్షంలో ఉన్నా వుండకపోయినా, చిల్లిగవ్వ లేకుండానైనాసరే వుండుటకు తమ ఇచ్ఛను ప్రకటించారు. ఐచ్ఛికంగా మిత్రులు వెల్లడించిన తీరుకు బాబా ముగ్ధులైనారు. వెంటనే మిత్రులందరి ముఖం కాళ్ళూ, చేతులు కడుగుకొని రమ్మన్నారు. అంత ప్రతి మిత్రుని చేయి పైనవుంచి, బాబా చేతిని వారి చేతిక్రిందుగా వుంచి, మిత్రునిచేతిలో నీరు బాబాయే స్వయంగా పోసి తన చేతిలో పడునట్లు బాబా చేతిని క్రిందుగా వుంచి హస్తోదకం స్వీకరించారు.

## ఉద్రేకాలు ఉద్రిక్తతలు

జాన్‌పూర్ పట్టణం చేరుటకు పడిన యమయాతనలరీత్యా మిత్రులమధ్య ఉద్రేకం పెరిగి, మనస్సు భగభగమంటూ కుత

కుత లాడుతోంది. రోడ్డంట పిల్లలు, ప్రజలు చేసే గోలతో పాటు, అలవాటులేని శారీరక శ్రమను తట్టుకోలేక మనస్సు సంక్షోభంలో వుంది. కొదరికీ విపరీతమైన పనివుంటే, కొంద రికి అసలు పనే వుండేదికాదు. అందరితోపాటు అనుసరించటమే వారివంతు.

డా॥ ఘనీ నవజీవనంలో కాలినడకన యిన్నిమైళ్ళు నడ వాల్సి వస్తుందని వూహించలేదు. ఆయన బాబాకు సహాధ్యాయి అయినందువలనో, లేదా వయస్సు దృష్టిలో వుంచుకొనో నవజీ వన ఆరంభంలోనే ఆతనికి కొన్ని సడలింపులు మంజూరు చేశారు. ఈయనేకాక మరి యింకా గుస్తాద్‌జీ వున్నారు. ఆయనకూడ వృద్ధుడే.! అయితే కొందరికి పనులు కేటాయించి, కొందరికేమీ పనులు చెప్పనందున, శ్రమపడేవారు మానసిక సంక్షోభానికి గురైనారు. అంటే, ఎదుటవానికేమీ పనిలేదనే ఆలోచనతో సంక్షోభం చెంది బుర్ర వేడెక్కింది అందరికీ.

జాన్‌పూర్ చేరిన మొదటిరోజు రాత్రి వారంతా ఆరు బయట నిదురించారు. అది ఎలాంటి రాత్రియో తెలుసునా? అతి భయంకరమైన చలిరాత్రి. గడగడ వణికించే చలి. కాళ్ళు చేతులు కొంకర్లు తిరిగాయి. ఆ చలికి పాపం గుస్తాద్‌జీ మేల్కొన్నప్పటికీ లేవలేకపోయాడు. చలికి వళ్ళంతా బిగుసుకు పోయి కదలలేక కట్టెలా బిగుసుకుపోయాడు.

ఆమరునాడు ఉదయాన్నే బాబా తన మిత్రబృందాన్ని మామూలుప్రకారం అభివాదములు వ్యక్తపరుచుటకు తయారైనారు. అప్పట్లో అమలులోవున్న ఆదేశాలేమంటే, అలా బాబా ఉదయాన్నే అభినందించుటకు వచ్చేముందు మిత్రులంతా తయారై, ఒక బృందంగా సమావేశమవ్వాలి. అయితే ఆరోజున గుస్తాద్‌జీ యింకా లేవనేలేదు. చలికి బిగుసుకుపోయి లేవలేక యింకా పడుకొనే వున్నాడు.

బాబా తయారైనారు. కానీ మిత్రులు యింకా లేవనే లేదు. అది గమనించిన యీరుచ్, పడుకున్నవారిని లేపుదామని వెళ్ళాడు. పాపం, మిత్రులంతా ఒక్కసారి యీరుచ్‌మీద విరుచుకుపడ్డారు. "నీకేమయ్యా! హాయిగా బృందనాయకుని వెంట ఖుషీగా, పనీపాట లేకుండా తిరుగుతావు. నీకేమి పని వున్నది? కేవలం బాబా వెంట తిరగటంతప్ప? నీవు చేసేది ఆయనవెంట తిరగటమేగదా? మరి మేమో! అసలు మేము చేసేపని నీకు తెలుసునా?" అంటూ ఒక్కొక్కరే అతనిపై విరుచుకుపడ్డారు.

తన స్వంత మిత్రులే, తాను బాబాతోవుండి తగు సమయము వాడుకున్నందుకు దూషణ తిరస్కార భావాల్ని ప్రదర్శించారు. అయితే బాబా మిత్రులకొరకు తయారుగా వున్నారన్న సంగతి ఎరిగివున్నందున, వారితో వాదనకు దిగి, కాలాన్ని వృధా చేయదలచలేదు. కానీ ఒక్కటే సమాధానం చెప్పాడు. "మంచిది

ఏది ఏమైనా, యిదిఅంతా మనకర్మ, అవి ఎంతటి కష్టములైనా, వాటిని సంతోషంతో అంగీకరించుట మన విధి" అన్నాడు.

అందుకు వారు "ఆహా! నీకేం నాయనా? నీ వేమైనా చెబుతావు. నీవేమీ కష్టాలు అనుభవించే పని లేనందున నీ వెన్నైనా నీతులు చెప్పగలవు" అంటూ రెచ్చిపోయారు. అంతట ఈరుచ్ ఆలోచనలో పడిపోయాడు. యిప్పుడు ఏం చేస్తే అంతా సద్దుమణిగి, అంతా దారిలో పడుతుందా అని ఆలోచించాడు. అసలు ఈ రగడకంతటికీ హేతువేమిటా అని ఆరా తీశాడు.

నిజానికి మిత్రులంతా మనస్సు నదుపులో వుంచుకొని, ఆహ్లాదంగా ఉండవలసిన సమయమది. కానీ డా॥ నీలూ, ఆవు దూడను ఆయాసపడుతు మోసి, తుదకు అర్ధ్రాత్రియిపన్ను కట్ట వలసి వచ్చేసరికి, తనవద్ద ఒక్కపైసాకూడ లేనందున అవమానము పాలైనందున, మనస్సు అదుపుతప్పి ఆవేదనపడుతున్నాడు. ఆ బాధలోవున్న నీలూ ఈరుచ్‌పై విరుచుకుపడ్డాడు.

"మా కష్టాలేమిటో నీకేమి తెలుసును? నీకేం? హాయిగా బాబా ప్రక్కన వుంటావు. ఆయన ఆగితే నీవు ఆగుతావు. ఆడవాళ్ళాగాలనుకున్నా మీ రాగిపోతారు. మీకంతా చక్కని కాలక్షేపమున్నది. నీవూ, ఆడవారు, ప్రక్కన బాబా. మరి మేమో? మమ్మల్ని వెనుకపడేశారు. పైగా మాకీ జంతువుల లంపాట మొకటి అంటగట్టారు. మరి వాటితో మేం పడే అష్టకష్టాలు, మీకేం అర్థమవుతుంది?"

అలా నీలూ ఏకరువు పెడుతుండగానే, అంతలో పటేలు అందుకున్నాడు మండిపడితూ "నీకేమయ్యా? ప్రొద్దుటే లేవగానే "టీ" కావాలంటావు. ఆ టీ తయారుచేసి యివ్వా లంటే, మే మేమి చేయాలో తెలుసునా? టీ కాయుటకు మేము చీకటితోనే లేవాలి. ఆవుదగ్గర బాగుచేయాలి. దూడకు పాలు చేపాలి. ఆవుకు కుడితి పెట్టాలి. పాలు పితకాలి. ఇదంతా చేయడానికి ఎంతో సమయం పడుతుంది. ఒకవంక కొంకర్లు తిరిగే చలి. అయ్యో! మరి పాలు ఎలా వస్తున్న వనుకుంటు న్నావు?" అని యింకా ఏమేమో అన్నాడు.

అప్పటివరకు వారి హృదయాంతరాళములలో దాచుకున్న ఆవేదనను, బాబా ముందు ప్రదర్శించి, ఒక అభియోగం చేయా లని నిశ్చయించుకున్నారు. అయితే మధ్యలో ఈరుచ్ తారస పడేసరికి అదంతా అతనిమీద చూపి విరుచుకుపడ్డారు. ఆతరువాత డా॥ ఘనీ కలిపించుకున్నాడు.

"యిటుచూడు। ఈరుచ్! నీ వేమనుకుంటున్నావో కానీ, క్రీడాకారుడైన మన మిత్రుడు బాబాకు వయోవృద్ధులగు తన సహచరులను యీవిధంగా యీడ్చుకొని వెళ్ళుట భావ్యమా? తానేమో ఒకవంక "నేను హితుడ" నంటారు. మరి అలాం టప్పుడు, వృద్ధులకు రాయతీలు యివ్వనక్కర లేదా? రోజూ తక్కువదూరం నడవకూడదా? మాలాటివారికి ఏ టాంగాలోనో, బండిలోనో కూర్చునే అవకాశం ఎందుకు యివ్వ

కూడను. యింకా ఈ ఒంటెబండి వున్నది. అది ఎప్పుడూ ఖాళీగానే వుంటుందికదా? పోతే 'కారవాన్' ఉన్నది. అది రాత్రిప్ళు ఆడవారికి విశ్రాంతి మందిరంగా ఉపయోగపడుతుందే తప్ప, పగలంతా నిరుపయోగం, ఖాళీగా నడుస్తుంది. మరి ఓ టాంగాకూడ వున్నది. అది వంట పాత్రలు, సామాను లేవైనా వుంటే ఉపయోగపడుతుందేతప్ప, ఇంకేమీ దానిపై ఉంచరు".

"ఇలాగే ఒంటెబండి, ఎడ్లబండి, టాంగా, కారవాన్, ఇవన్నీ వృధాగా, ఖాళీగా నడుస్తున్నవి. ఏం? వృద్ధులైన మమ్మలను, బాబా ఆ బళ్ళపై కూర్చొనుటకు, అనుమతించ వచ్చునుకదా? అలా చేస్తే, మాకూ సునాయాసంగా ఉంటుంది కదా!"

యింతసేపు మిత్రులు తమతమ, కష్ట నిష్టూరాలు చెప్పుకు పోగా, అక్కడ బాబా "యింకా మిత్రులు రాలేదేమా?" అని వారిరాకకొరకు ఎదురుచూస్తూ ఉండిపోయారు. ఇలాంటి మానసిక ఆందోళనలు కలిగివుండుట ఎంతమాత్రం సమంజసం కాదని నచ్చచెప్పుటకు యీరుచ్ ఎంతో ప్రయత్నించాడు. అంతేకాదు వారి బాధలనుకూడ తాను పూర్తిగా అర్ధం చేసుకున్నాడు. కానీ అంతటితో ఆగలేదు. నూతినుండి నీరు తోడాలి. అదో పెద్ద సమస్య అయిపోయిందంటూ మళ్ళీ వాదన ప్రారంభించారు.

మొత్తం బృందానికంతటికీ సరిపడిన నీరు పురుషులే నూతినుండి తోడి తేవాలి. దానికితోడు, ఒంటెకు, తెల్లగుర్రానికి,

అవుకు, ఎద్దులకుకూడా నీళ్ళు తోడాలి. మరి ప్రతి సాయంత్రం, జంతువులన్నిటికీ సరిపడ మేత, పొలాలవెంట వెళ్ళి తేవాలి. ఇవన్నీ వింటుంటే, 'అయ్యో పాపం!' అని మనకు జాలేస్తుంది. నిజమే యీ కష్టాలన్నీ వీరిమీదనే వున్నాయి. ఈరుచ్‌మాత్రం హాయిగా బాబాను అంటిపెట్టుకొని కూర్చుంటాడు. సహజంగా వారి ఆరోపణలన్నీ ఈరుచ్ మీదనే కేంద్రీకరించాయి.

అంతట్లో, డా॥ డాన్‌కిన్ అందుకొని, "మరి నీవు బాబాకు ప్రతిరూపంగా ఉంటున్నావు. కష్టమంతా మా పరమైంది" అన్నాడు. చివరకు, వాళ్ళకు ఈరుచ్ శతవిధాల నచ్చచెప్ప ప్రయత్నించి, ఎదురు చూస్తున్న బాబా వద్దకు వెళదాం పద మన్నాడు. దానికి విలియమ్ డాన్‌కిన్ కోపోద్రిక్తుడై పోయాడు. "ఈ గుర్రంతో నేను ఎంత వేగిపోతున్నానో నీ వెరుగవు. అసలు యిలాంటి గుర్రాన్ని అదుపుచేయటం నీకు తెలుసా? అయ్యబాబోయ్! అది గుర్రంకాదు. యమ రాక్షసి." అంటూ యింకా ఏమేమో అన్నాడు.

"సరే అంతా నిజమే! ముందు బాబా వద్దకు వెళదాం పదండి! సమయమైంది. ఇది మనమంతా నవ్వుమొఖంతో బాబా సమక్షంలో వుండాల్సిన సమయం. ఈ నియమాన్ని మరువరాదు. మనం మన ఉద్రేకాలను అదుపులో వుంచుకొని, చిరునవ్వుతో ఇహ వెళదాం పదండి." అన్నాడు ఈరుచ్. మొత్తానికెలాగో అందరూ సర్దుకొని స్థిమితపడ్డారు. చిరు నవ్వుతో బాబా వద్దకు వెళ్ళారు. అంతా సవ్యంగానే జరిగిపోయింది.

## మనసులు - మమతలు

బాబా సమక్షంలో ఎవరూ ఎట్టి ఉద్రేకతా ప్రదర్శించలేదు. ఏమీ ప్రస్తావించలేదు. బాబా మాత్రం, అభివాదములయిన తర్వాత మరి రెండు రోజులైన తర్వాత మరిరెండురోజులపాటు జాన్‌పూర్‌లోనే వుండి ఆ తర్వాత ముందుకు సాగిపోదామని ప్రకటించారు. యిలా బాబా ఎందుకు నిర్ణయించారో, అందునా ఈవిషయాన్ని మిత్రులతో ఇప్పుడే ఎందుకు ప్రస్తావించారో ఎవరూ వూహించలేకపోయారు. మరి అది బహుశః మిత్రులకు సహాయపడేందుకో, లేదా వృద్ధులకు, ముఖ్యంగా ఏదేని కార్య క్రమాన్ని అనుసరించుటకై తగుసమయం కొరకో వేచి యుండు టకు నిర్ణయించి ఉండవచ్చును.

ఏమైనప్పటికీ కొద్ది సమయం గడిచిన తర్వాత, బాబా మహిళలవైపుకు తన వుపాహారం పూర్తి చేయుటకు వెళ్ళి పోయారు. ఆ తర్వాత మిత్రులు తమ వుపాహార కార్యక్రమం పూర్తిచేసుకొని విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో డా॥ ఘనీ ఉపన్యాస ధోరణిలో చర్చ ప్రారంభించాడు. బాబాకు కావలి కాస్తూ యిారుచ్ దూరంగా గమనిస్తున్నాడు.

ఉచ్ఛ స్వరంతో డా॥ ఘనీ "మామూలుగా బహిరంగ ప్రదేశాలలో అన్ని తరహాల సమాజాలవారు, ఉపన్యాసాలిచ్చుట మనకు తెలుసును. అలాగే 'మనం యిప్పుడు, యిక్కడే మన మానసిక సంక్షోభాల్ని ఎందుకు బహిర్గత పరచకూడదు?' అని

నేను అడుగుతున్నాను.  ఇప్పుడు బాబా మన కెంతమాత్రం దైవ మానవుడను కాదని అన్నారు. సద్గురువునుకూడ కాదన్నారు కేవలం మామూలు మిత్రుడనే వన్నారు. అటువంటప్పుడు తన తోటి మిత్రులతో, మరో మిత్రుడు తన కష్ట సుఖాల నెందుకు చెప్పుకోకూడదని నే నడుగుతున్నాను." అంటూ ఉపన్యాసం దంచాడు.

అందుకు కొందరు "అవును. ఎందుకు చెప్పకూడదు?" అన్నారు. "ఆయితే మనమంతా ఎందుకలా చేయరాదు? నవ జీవనమంటే, మిత్రి భావంతో స్నేహమయ జీవనమని అన్న ప్పుడు, మనం మన కష్టనిష్ఠూరాల్ని ఏల వ్యక్తపరచకూడదు?" అని మరొకరన్నారు. అంతలో యీరుచ్ అటుగా వచ్చి వారి సంభాషణలో జోక్యం కల్పించుకుంటూ, "అవును. మీరు మీ కష్టాల గురించి తప్పక చెప్పవచ్చును. కానీ వచ్చిన యిబ్బం దల్లా, ఆయనముందు విచారవదన ముంచరాదుకదా! అదొక్కటే చిక్కు సమస్య" అన్నాడు,

## అనుచరవర్గం సమ్మె

"అవును, నిజమే! మేము మా అసంతృప్తిని వ్యక్త పరచాలంటే యీ ఆజ్ఞ ఒకటి అడ్డొస్తోందే!" అన్నాడో శిష్యుడు. "ఆఁ! యీ ఆజ్ఞను ఉల్లంఘించకుండానే, మన అసంతృప్తిని వ్యక్తపరిచే మార్గమొకటి ఉంది. నాకు తెలుసును" అన్నాడు డా॥ ఘనీ. "ఏమిటేమిటి?" అన్నారు అంతా ఒక్కసారిగా.

"ఆఁ! ఏముంది? మనమంతా సమ్మె చేద్దాం. రేపు ఉదయాన్నే మన బాస్ అభినందించు కార్యక్రమంలో పాల్గొనుటకు వస్తారుగదా! అప్పుడు మనమంతా సమ్మె చేద్దాం. ఎవ్వరూ వెళ్ళవద్దు, ఏమంటారు? మీరంతా యిందుకు సిద్ధమేనా?" అని ప్రశ్నించాడు. డా॥ ఘనీ బాబాను బాస్ అనేవాడు. అలా సమ్మె చేయుటకు ఎందరు సుముఖులో చేతులెత్తమన్నాడు. కొందరు చేతులెత్తారు. మరి కొందరు తటస్థంగా వుండిపోయారు. దానితో డా॥ ఘనీ తిరిగి ఉపన్యాసం కొనసాగిస్తూ, "ఏం? అందరూ ఎందుకు చేయరాదు. మనమంతాకూడ యీ జీవితంతో, విసిగి వేసారి, అలసిపోయి ఉన్నాము. మనకేదైనా కొంత సహాయం, కొన్ని మినహాయింపులు, జరగనిదే యీ జీవనంలో యికముందు యిలాంటి కష్టాల్ని ఎలా భరించగలం? ఈవిధంగా బాధలు పడుతూ ఎన్నాళ్ళు తిరగగలం? మనకు మొదట్లోనే బాబా చెప్పారు గుర్తున్నదా? ఈ నవజీవనం అంతమంటూ లేక శాశ్వతంగా కొనసాగుతుందన్నారు. పాత పద్ధతులు, పాతచోట్లకు తిరిగి రామన్నారు. ఆ నమ్మకంతోటే, యీ జీవితాన్ని మనమంతా ప్రారంభించాము. కనుక ఈరకపు జీవితానికి, మనం అలవాటు పడేందుకు అవుసరమయ్యే కనీస సౌకర్యాలు తప్పనిసరిగా పొందితీరాలి" అంటూ అందరినీ విధిగా సమ్మెలో పాల్గొనమని విజ్ఞప్తి చేశాడు డా॥ ఘనీ. అంతా "సై" అన్నారు.

మరుసటిరోజు రానేవచ్చింది. ఆనాటి ఉదయం అంతా బాబాను, ఏ ఒక్కరూ వెళ్ళి చూడరాదని పథకం వేసుకున్నారు. ఒకవేళ బాబాయే స్వయంగా వచ్చి చప్పట్లు చరిచి ఎవరినైనా రమ్మని పిలిచినా వెళ్ళరాదని నిశ్చయించుకున్నారు. ఆ పథకం ప్రకారం నీ సంగతేమిటని యీరుచ్ వడిగారు. అందుకు ఈరుచ్ "మీరేకదా చెప్పారు! మీకైతే అన్నీ కష్టాలేనని, నాకేమీ కష్టాలు లేవని, హాయిగా ఆయనను అంటిపెట్టుకొని ఖుషీగా తిరుగుతానని అన్నారుగదా! అందువలన నేనీ సమ్మెలో పాల్గొనవలసిన అవుసరం నాకులేదుకదా! నేనుమాత్రం బాబాను విడువను. ఆయనను అంటిపెట్టుకొనే ఉంటాను. మీతో సహకరించలేక పోతున్నందుకు విచారిస్తున్నాను" అన్నాడు.

అతని సమాధానం వారిని రెచ్చగొట్టింది. "నీవు వట్టి కపటివి. పచ్చి మోసకారివి. నమ్మక ద్రోహివి. మిత్రద్రోహివి. అయినా ఒక విషయం గుర్తుంచుకో! నీ వేమీ మాకంటే అధికుడవు కావు. యిదంతా నమ్మకంతో నీమంచికే చెబుతున్నాం. నీపై మాకేమీ ఈర్ష్య లేదు. మనమంతా కలసి వున్నాంకనుక యింతగా నీకు చెబుతున్నాం. మాలోని ఒక్క మిత్రుడుగా నీవుకూడ మాతో సహకరించుట నీ ధర్మం" అన్నారు. ఏమైనా తాను బాబాను విడిచి రానని ఖండితంగా ఈరుచ్ చెప్పాడు.

# సందర్శన ప్రభావం

తానొకటి తలిస్తే దైవమొకటి తలచువట్లు, ఆనాడు మామూలుగా కాక, విచిత్రంగా చిన్న వినోదం జరిగింది. మామూలుగా బాబా వచ్చారు. సర్వజ్ఞుడాయన. జరుగుతున్న దంతా ఆయన గమనిస్తూనే ఉన్నారు. అయితే ఆవిషయం తనకు తెలుసన్నట్లు బహిర్గతం కానీయలేదు. నవజీవనంలో ఆయన మిత్రులకు మిత్రుడు. అందువలన తన భావాలను బహిరంగ పడనీయక మంచి ఉల్లాసంగా వున్నారు.

ఆనాడు తాను మిత్రులెవరినీ కలుసుకొనలేదు. మిత్రులంతా దూరంగా ఒక చెట్టుక్రింద కూర్చొని వున్నారు. కాసేపాగి బాబా యీరుచ్‌ని పిలిచి, "యిప్పుడొక ముఖ్యమైన సమావేశం జరగాలి. పోయి మిత్రులందరినీ పిలుచుకు రమ్మ"న్నారు. వాళ్ళేమో ఎలాంటి పరిస్థితులలోనైనా సరే వెళ్ళరాదని మొరా యించుకొని కూర్చున్నారు,

అయినా బాబా ఆజ్ఞకు బద్ధుడై మెల్లగా అడుగులేసుకుంటూ యీరుచ్ చెట్టుక్రింద కూర్చున్న మిత్రులవద్దకు వెళ్ళాడు. అతని రాకను మిత్రులు గమనిస్తున్నారు. ఈరుచ్ వాళ్ళను చేరి "చూడండి! యిప్పుడు బాబా వచ్చి కూర్చున్నారు. వెంటనే ఏదో సమావేశం జరగాలట. అందుచేత, మిమ్మలను వెంటనే పిలుచుకు రమ్మన్నారు. అతి ముఖ్యమైన సమావేశమట" అని చెప్పాడు. అతడు చెప్పింది విన్నా, అసలాతడు అక్కడకు

వచ్చినట్లే గమనించనట్లు, ఎటోచూస్తూ పూరుకొని అతనితో మాట్లాడలేదు.

వారు యూరుప్‌ని పూర్తిగా వెలివేశారు. కొంత తడవలాగే మౌనంగా నిలబడి, ఈరుచే మళ్ళీ వాళ్ళని పలకరించాడు. "చూడండి! యిది మీకు ధర్మంకాదు. చూచుటకిదేమీ బాగాలేదు. మనమిలా ప్రవర్తించుట ఏమంత బాగాలేదు. ఘనీ మన మిత్రుడేకాక, బాబాకు సహాధ్యాయికూడ కనుక ఆయన దేనికైనా సమర్థుడు. బాబా ఆయన కెంతస్వేచ్ఛ, ఎన్ని ప్రత్యేకతలు కల్పించారో మీకందరికీ తెలుసును. మరి అలాంటివి మరెవ్వరికీ కలిపించలేదుకదా!" అంటూ రక్కినవారి మనస్సు తట్టినట్లు లేపాడు యూరుప్. నిజమంటే నిజమన్నట్లు కొందరు ఒకరి ముఖాలు ఒకరు చూచుకొనుట కానవచ్చింది. మరికొందరు సిగ్గుతో తలలు ఎత్తి చూచుటకుకూడ ఏడిుపడ్డారు.

## నైతికాదర్శం

పరిస్థితి గమనించిన ఈరుప్ మరి గత్యంతరం కానరాక, మెల్లగా వెనుతిరిగి బాబావద్దకు వెళ్ళిపోయాడు. "ఏం జరిగింది? సంగతేమిట"ని బాబా సౌంజ్ఞ చేశారు. "వాళ్ళు రావటం లేదా?" అని అడిగారు. "అదేంలేదు బాబా! వాళ్ళు వస్తున్నారు" అని నసిగాడు. దూరంగా వున్న మిత్రులను చూపి "ఏమిటి? వాళ్ళంతా అక్కడే నిలబడి వున్నారే? అసలు విషయం ఏమిటి? నా ఆజ్ఞను వాళ్ళకు తెలుపలేదా?" అని

ప్రశ్నించారు. "చెప్పాను బాబా। వాళ్ళు... వస్తున్నారు" అన్నాడు కానీ బాబాకు అంతా తెలుసును. ఏదో కుట్రవంటిది జరుగుతోందని, అందువలన ఓర్పుతో నిరీక్షించారు. ఒకరి తర్వాత ఒకరు మెల్లగా మిత్రులంతా రాదొడగారు.

ఈరుచ్ ప్రశ్నతో వారి మనస్సులో సంక్షోభం చెలరేగింది. తుదకు తమ నియమోల్లంఘన గుర్తొచ్చింది. మమత పెరిగింది. ఒక్కొక్కరే రాదొడగారు. చివరకు ఘనీ ఒక్కడే మిగిలాడు. అతడేమీ చలించలేదు. ఎలా కదలగలడు? అసలు దీనికంతటికీ కథానాయకు డాయనేకదా। అతనికి ప్రెస్టేజి అడ్డు వచ్చింది. తానూ వెళితే గౌరవహాని జరుగుతుందని కదలలేదు.

అతడు ఎంతకీ రానందున బాబా, మళ్ళీ ఈరుచ్‌ని వెళ్ళి పిలుచుకు రమ్మన్నారు. "నీ మనస్సులో ఏం ఉన్నాసరే, నీకు ధైర్యం వుంటే। (ఈమాట ఘట్టిగా చెప్పమన్నారు) — నీకు ధైర్యం వుంటే, బృంద నాయకుని చెంతకు వచ్చి, ఫలితం అనుభవించుటకు సిద్ధం కమ్మనీ, హృదయం విప్పి, నీ స్నేహితునితో అంతా వివరంగా చెప్పుకో" అని చెప్పమన్నారు. అంతకు పూర్వం యితరులను ఒప్పించి, బాబా పరిధిలోనికి తెచ్చే సందర్భాలలో, ఘనీ సరిగ్గా అవే మాటలు వాడేవాడు. అందుకే బాబా అతని మాటలే అతనికి ఇప్పుడు వర్తించేటట్లు వాడారు.

ఈరుచ్ బాబా చెప్పమన్నట్లే ఘనీకి చెప్పాడు, ఆమాటలు విన్న ఘనీ మండిపోయాడు. "ఏమిటీ నాకామాత్రం ధైర్యం లేదా? నా స్నేహితుని వద్దకు వచ్చి మాట్లాడే ధైర్యం నాకు

విలియమ్ డాన్‌కీనులు తోలుతున్నారు. విరిగిపోయిన చక్రాన్ని వేరొక టాంగాపై తీసుకువెళ్ళి బాగుచేయించుకు రమ్మన్నారు. ఆచక్రం విరిగిన దరిదాపుల్లో వడ్రంగి దుకాణం లేదు. ప్రక్క ఊరిలో వున్నట్లు వాకబు చేయగా తెలిసింది. ఫలితంగా తప్పని సరిగా ప్రక్క ఊరికి తీసుకు వెళ్ళవలసి వచ్చింది.

మిత్రులలా ప్రక్కవూరికి చేరి, చక్రం బాగుచేసే వడ్రంగి మేస్త్రీని కలుసుకున్నారు. అతడు దానిని బాగుచేయుట కంగీక రించాడు. పూర్తిగా బాగుచేసి యిచ్చేసరికి బాగా రాత్రి పొద్దు పోయింది. మర్నాడు ఉదయాన్నే తమ ప్రయాణం సాగించాలి కనుక ఎంత రాత్రైనా మిత్రులు తమ మకాం చేరాలి. వాళ్ళ కిచ్చినపైకం విరిగిన చక్రాన్ని బాగుచేయించుటకు, గుర్రానికి దానాకయ్యే ఖర్చుకిగాందనే వాడాలి. కానీ వారి భోజనానికయ్యే ఖర్చు అందులో వాడరాదు. ఫలితంగా వారు ముట్టెత్తవలసి వచ్చింది.

అప్పుడు ఆదీజీ అన్నాడు. "ఇప్పుడు బాగా రాత్రై పోయింది. ఈపాటికి అంతా నిద్రపోయి వుంటారు. యిప్పుడు మన మెక్కడికి వెళ్ళి ముట్టెత్తుతాము?" పాప మా సమయా నికి, వారు మంచి ఆకలితో ఉన్నారు. మరి ఆ వడ్రంగికి డబ్బు లిచ్చి పని చేయించుకున్నారు కనుక అతనిని యాచించలేరు. అందుకు ఆదీ ఒక ఉపాయం ఆలోచించాడు. అతడు చేసిన పనికి, అయిదురూపాయ లిస్తే సరిపోతుందని తెలిసినా పది రూపాయలు చెల్లించాడు.

అంత నా వ(డంగి, "అయ్యో! యిది నేను చేసిన పనికి ఎక్కువ పరిహారమే. ఇంత ఎక్కువ ఎందుకిచ్చారు?" అని అడిగాడు. "లేదు లేదు! ఏం ఫరవాలేదు తీసుకో" అని ఆది బలవంతం చేశాడు. "పాపం, నీవు చీకటి పడినా కష్టపడి మా పని చేసిపెట్టావు. చాల సంతోషం. మేమిప్పుడు మా భిక్షకొరకు యాచిస్తూ పోవాలి. మేము మా ఆహారం, భిక్షలోనే సంపాదించాలన్న నియమం పాటిస్తున్నాము. కనుక చిల్లరకని యిప్పుడు మమ్మల్ని యిబ్బంది పెట్టక యీపది రూపాయలు నీవే వుంచుకో" అన్నాడు.

ఆది అన్నదానిలోని భావాన్ని ఆతడు (గహించినట్లున్నాడు. అయితే ఆ భిక్ష నేనే ఏర్పాటు చేస్తాను స్వీకరించండని, పది రూపాయలు తీసుకొని, వారికి భిక్షకూడ పెట్టాడు. దానినిబట్టి మనకు అవగతమయ్యే దేమంటే, కొద్దిపాటి తెలివి, చిన్న స్వేచ్ఛాలోచన శక్తి, సమయస్ఫూర్తి లాంటివి నవజీవనంలో అవసరానికి ఉపయోగించుకొనుట జరిగింది.

## సర్వతోముఖ వికాసం

డిశంబరు 22-వ తేదీకి మొరాదాబాదు చేరారు. అప్పుడు చలి విపరీతంగా ఉంది. వారికున్న కొద్దిపాటి చాలీచాలని బట్టలతో తట్టుకోవడం మి(తులకు కష్టంగా వున్నది. వారు సొంతం ఆరుబయట వుండుటచేత, వారి వ్రేలి గోళ్ళు నీలంగా

బాబా ప్రేమికుని కలవమని ఆధీని పంపారు. హరజీవన్‌లాల్‌ను ఆదీకి, మొరాదాబాద్‌లో బాబా పార్టీ విడిది చేయడాని కనువైన స్థలం కనుగొనుటలో సహాయపడమని ఆదేశించారు.

మరునాడు బాబా చూడ ముచ్చటగా కనిపించారు. దివ్య కాంతులతో ప్రతిఫలిస్తున్నారు. "మనం పూర్వ జీవనాన్ని వదిలేశాం. మళ్ళీ ఆ జీవనంలోకి తిరిగి వెళ్ళటమనేది లేదు. పూర్వ జీవనం ఆచరణరీత్యా మృతప్రాయమైనది. ఒక వ్యక్తి మరణించి నప్పుడు జీవం ఆ శరీరంతో 3 లేక 4 రోజులు సంబంధం పెట్టుకుంటుంది. మళ్ళీ ఆ జీవశక్తి మరో క్రొత్తచోటులో ఆశ్రయించేలోపల, జరిగే ఆ కాస్తకాలాన్ని పాత, క్రొత్త జీవితాల మధ్య శూన్యం అంటారు. అదేమాదిరి 16-10-1949 న మన పాతజీవితం చచ్చిపోయింది. డిశంబరు 21 వరకు మన నవ జీవనం, ఒకరకమైన సంబంధాన్ని పాత జీవితంతో కలిగి వుంది. కనుక 22-12-1949 నుండి 31-12-1949 వరకు వాక్యూమ్ పిరియడ్‌గా ప్రకటిస్తున్నాను. యీ పది రోజుల కాలంలోను శిక్షణకు సంబంధించిన అన్ని కష్టాల్ని పూర్తిగా రద్దు చేస్తున్నాను. ఆ పదిరోజుల కాలంలోను శిష్యులు, భిక్షాటన చేయనవసరం లేదు. గౌను, తలపాగ ధరించ నవసరంలేదు." అని నిర్ద్వందంగా ప్రకటించారు.

ఇది ఒక పూర్తి విశ్రాంతికాలం. మరి ఆ రోజులలో కడుపార భుజించవచ్చును. ఊహించని యీ ప్రకటన విన్న మిత్రులందరి హృదయాలు ఆనందంతో నిండిపోయాయి.

బహుశః, మిత్రులంతా తమ నవజీవన కాలంలో ఎటువంటి వడిదుడుకు లొచ్చినా ఎదుర్కొనే శక్తి కలిగివుంటే, తమ హృదయాలు ఆనందంతో ఉప్పొంగి మిక్కిలి ధైర్యంతో చిట్టచివరి వరకూ బాబాను అనుసరించగల సహాయం అందించ గలదన్న సత్యాన్ని ఆచరణ రూపంలో నిరూపిస్తున్నారన్నట్లుగా కనిపించింది.

జాన్‌పూరు వరకు చేసిన ప్రయాణం భిక్షుక వృత్తితో, జిప్సీ జీవనం గడుపు అనుభవమైంది. బాబా రాత్రిళ్ళు తన రెండు మడతల డేరాలో హరికెన్ లాంతరు పెట్టుకొని పడుకొనేవారు. చీకటితోనే లేచి కూర్చొని, మిత్రులందరికీ ఒప్పగించిన తమతమ పనులు నిర్వర్తించేటట్లు చూచేవారు. అంతా నాలుగు గంటలకల్లా లేవాలి. అందరూ లేచేటట్లు బాబా చూచేవారు. ఒక గంట తరువాత ఒక కప్పు వేడివేడి టీ త్రాగి, తమ విధులకు వెళ్ళిపోవాలి.

మొరాదాబాద్ చేరాక, వాక్యూమ్ పిరియడు ఆరంభమౌతుంది. అది మిత్రులు పాలిట విశ్రాంతికాలం. ఢిల్లీ అడ్వకేటు, హరజీవన్‌లాల్, కోనే దేశాయ్‌ల సహాయంతో రైల్వే స్టేషనుకు సమీపంలోని రామలీలా భవంతిలో బాబా బృందానికి విడిది ఏర్పాట్లు జరిగాయి.

## నీతి - విజాయితీ

మొరాదాబాదు ప్రయాణంలో దార్లో వారివెంట ఉన్న టాంగాల్లో ఒకదాని చక్రం విరిగిపోయింది. ఆ టాంగాను ఆదీ,

పూర్తిగా వుంది. ఏం? నేనలావచ్చే ఎందుకు మాట్లాడకూడదు? అదేమాట తక్కినవారందరికీ చెప్పగలను," అంటూ వడివడిగా బాబా దగ్గరకు చేరాడు.

హడావిడిగా వచ్చిన ఘనీని చూచి "ఏమిటి, సంగతి?" అన్నారు. ఘనీ అసలు విషయం చెప్పకుండా, అప్పటివరకూ తనతో వున్నవారిని దూషిస్తూ "మన స్నేహితులంతా పచ్చి మోసగాళ్ళు బాబా!" అన్నాడు. "వాళ్ళందరినీ కలిపి మోస గాళ్ళంటావేమిటి?" అన్నారు.

"వాళ్ళేమిచేశారో నీకేంతెలుసు బాబా। ఈ రోజు ఎవరూ నిన్ను కలుసుకోవనమని నాకు మాట యిచ్చారు. ఏకగ్రీవ ముగా నిర్ణయించిన మాటకు కట్టుబడి ఉంటామని వాగ్దానంకూడ చేశారు." అంటుండగా బాబా కల్పించుకొని "అసలు నీ వెవ రవు? వారినుండి మాట తీసుకొనుటకు?" అన్నారు. బాబా సౌంజ్ఞలను ఈరుచ్ చదువుతున్నాడు. దానితో ఘనీకి ఉక్రోషం మరీ ఎక్కువైంది.

"మధ్యలో నీకెందుకు ఈరుచ్ కల్పించుకుంటావు? బాబా సౌంజ్ఞలు నే నర్థం చేసుకోగలను. కనుక నీవు మాట్లాడవద్దు" అన్నాడు. అలా యీరుచ్ మీద విరుచుకుపడేప్పుడు అతనివైపు చూసిన కోపంతో కూడిన చూపులను బాబా గమనించినా మిన్న కున్నారు. తటస్థంగా ఉన్నారు. ఇంతకుముందు వుద్రేకాలు వెలిబుచ్చిన తోటి సోదరులంతా తాము వెలిబుచ్చిన విషయాలను

మరిచేపోయారు. డా॥ ఘనీ మాత్రం బాబా ముందు బలిపశువై నాడు.

"నేను కేవలం నీకు మిత్రుడు మాత్రమే కాదని నీకు తెలుసునా? చిన్ననాటి సహాధ్యాయినని గుర్తుందా? చిన్నప్పుడు మనిద్దరం ఎలా కుస్తీ పట్టేవారమో జ్ఞాపక మున్నదా? మరి, నీవిప్పుడు నాతో కుస్తీపట్టి యీ విషయం తేల్చుకోదలచావా?" అని బాబా నిగ్గతీశారు. వెంటనే డా॥ ఘనీ ఫకాలున నవ్వి బాబాకు లొంగిపోయాడు. జరిగిందంతా మరచిపోయాడు.

ఆ సమావేశం సామరస్యంతో, స్నేహపూర్వకంగా మారి పోయింది. అందరూ జరిగింది మరచిపోయారు. ఆనాటి తరువాత అందరిలోను చాల గొప్ప మార్పు వచ్చింది. ఎవరూగూడ, ఏవిధమైన దుష్ట తలంపులనుకానీ, బాధలనుకానీ, కోపతాపాలను కానీ, లేదా ఏవిధమైన ఆందోళనలనుకానీ, మానసికంగా ఉంచుకో లేదు. మొదట్లో ఎలా వుండేవారో అలా మారిపోయారు. అరిషడ్వర్గాల కాలవాలమైన మనస్సు, అవతారుని సమక్షంలో నాటి నుండి సంపూర్ణ విజయం సాధించి, ఈర్ష్య, ద్వేషాలకు బదులు మమతను పెంచుకుంది.

## స్వేచ్ఛాయుత జీవనం

ఢిల్లీకి తూర్పుగా 150 కి. మీ. దూరంలోవున్న మొరాదాబాదు వారి తదుపరి మజిలీ. ఢిల్లీలోవుండే హరజీవన్‌లాల్ అనే

మారిపోయాయి. పాపం వారికేమి చేయాలో తోచలేదు. మొరాదాబాదులో వున్న సమయం వాహ్యాం పీరియడని చెప్పు కున్నాంకదా! అందుచేత వారికేమీ పనిలేదు. వూరికినే కూర్చో వలసి వచ్చింది.

మామూలుగా అయితే, సరిపడా దూరం నడచి, పరిశ్రమించుట ద్వారా అవుసరమయ్యే ఉష్ణాన్ని పొందకలిగేవారు. అయితే యిప్పుడు అదీలేదు. పూర్తి విశ్రాంతిలో వున్నారుగదా! మొదటిరాత్రి గడిచింది. అది అతి భయంకరమైన కాళరాత్రి. అంతా ఏక నిష్టతో గజగజ వణుకుతున్నారు. పోనీ ఏదైనా మంట వేసుకొని చలి కాగుదామంటే పుల్లలు కొనేందుకు పైకం లేదు. అంతా, మొరాదాబాదులో రోజు లెలా గడపగలమా అని ఆదుర్దా పడుతున్నారు. మొరాదాబాదు ఉత్తర భారతంలోని కడు ఎత్తైన ప్రదేశంలో ఉన్న అతి శీతల ప్రదేశం.

మర్నాడు ఉదయాన్నే ఒక ఆగంతకుడు వారి మకాంవైపు వచ్చుట మిత్రులు పసికట్టారు. అ వచ్చేది ఢిల్లీ అడ్వకేటు హరజీవన్‌లాల్ కొడుకు. ప్రస్తుతం హరజీవన్‌లాల్ మరణించాడు. కానీ అతని కుమారుడు యింకా సజీవుడే. ఆతడు యింగ్లాండు పైచదువుల కెళ్ళాడు.

భిక్షాటన నియమోల్లంఘన కానిరీతిలో హరజీవన్‌లాల్, కిషన్‌సింగు, కైను యీ ముగ్గురూ కలసి, పూర్తి భిక్షరూపంలో, కొన్ని తినుబండారాలు, ఉన్ని దుస్తులు మిత్రబృందానికి సమ

ర్పిస్తే బాగుంటుందని తలపోశారు. మిత్రుల కవసరమయ్యే ఆహార పదార్థాలు, దుస్తులు బండినిండా వేసి, హారజీవన్ కుమారునికిచ్చి పంపారు.

## మమతలు - మమకారాలు

ఆ సమయంలో బాబా మిత్రుల ప్రక్కనే ఉండుటచేత, అంతా సవ్యంగా గమనించారు. అంతకు ముందు హారజీవన్ లాలు అలా తినుబండారాలు, ఉన్ని దుస్తులు భిక్షగా సమర్పించుకోవాలన్న ప్రేరణ కలిగి, బాబా అనుమతి కోరాడు. అందుకు బాబా అనుమతించి, జనవరి 21-వ తేదీలోగా తమవారిద్వారా కాక తాను అనుమతించిన వానిద్వారా పంపమని ఆదేశించారు.

అయితే బాబా ఆజ్ఞ పాటించలేదు. తమ కుమారునికిచ్చి పంపారు. అందుచేత ఆ పిల్లవాడ్ని పిలిచి, నా ఆజ్ఞ ఎందుకు ఉల్లంఘించారని ప్రశ్నించారు. ఆ చిన్న హెచ్చరిక విన్నంత మాత్రం చేతనే ఆ పిల్లవాడు అచేతనుడై క్రింద పడిపోయాడు. అతనిని పునరుజ్జీవిని చేయుటకు మిత్రులు చాల యాతన పడ్డారు. అతడు క్రింద పడినప్పుడు దభేలుమని శబ్దం వచ్చుటచేత, తల పగిలిందేమో నని శిష్యులంతా భయపడ్డారు.

ఆ పిల్లవాడు తిరిగి చైతన్యవంతుడైన తర్వాత తన కథ ఇలా వివరించాడు. బాబా బృందం బెనారసు వదలి మొరాదా చేరువరకు అతని తండ్రి బాబా ప్రయాణాన్ని గురించి గమనిస్తు

ఉన్నాడట. రాబోయే శీతాకాలాన్ని దృష్టిలో వుంచుకొని, బాబాకు మిత్రులకు తగినన్ని దుస్తులు లేవని తెలిసి యుండుటచేత అతడు వీరందరికి ఉన్ని బట్టలు సరఫరా చేయాలని పథకం వేసుకున్నాడు. వారి భోజనానికై, యాచనమీద ఆధారపడి వున్నందున, వారికొరకు ఎండు ఫలాలు, అంగోరా మొదలగునవి బళ్ళ కొద్ది పంపు ఏర్పాటు చేశాడు. వాటిలో దుప్పట్లు, చేతికి గ్లోవులు, కాళ్ళకు మేజోళ్ళు, ఉన్ని స్వెట్టర్లు, మఫ్లర్లు, ఊలు టోపీలు వున్నవి. ఉన్ని బట్టలతోపాటు నూలు బట్టలు కూడ పంపాడు.

ఈ హఠాత్సంపదంతా చూచి మిత్రులంతా ఆశ్చర్య పడ్డారు. బాబా యీ విషయమై, ఎన్నడూ యీషణ్మాత్రం, సూచనగానైనా బహిర్గత పరచలేదు. ఒక వారం విశ్రాంతి తీసుకుందామని మాత్రమే చెప్పారు. అకస్మాత్తుగా ఢిల్లీలోవున్న ఆ లాయరుగారికి ప్రేరణ కలిగించి, సమయానికి అవసరం తీర్చే విధంగా అవన్నీ వచ్చే ఏర్పాటు చేయడం బాబా కృపకాక మరేమిటవుతుంది ?.

సరిగ్గా ఆసమయంలోనే మిత్రులంతా, "యీ జీవితం గడుపుట కడు దుర్లభం. ఏదేని ఆచ్ఛాదనగానీ, అగ్నిగుండం గానీ ఉంటేతప్ప ఇహ ఎంతమాత్రం బతకలేం" అని ఆలోచిస్తున్న సమయంలో యివన్నీ వచ్చి చేరాయి.

బాబా ఆ పిల్లవానిని చేర బిలిచి, అతడు తెచ్చినవాటితో చాల ఆనందించానని చెప్పారు. తమకు పంపిన వాటితో

తానెంతో సంతోషించానని, తిరిగి మరెన్నడూ తన తండ్రి, తమను, తమ బృందాన్ని అనుసరించరాదని చెప్పమన్నారు. తమ బృందంతో ఆతడు ఎంతమాత్రం సంబంధం పెట్టుకోరాదన్న మాట. ఆ తర్వాత ఆ పిల్లవాడు అక్కడనుండి వెళ్ళిపోయాడు.

వచ్చిన కానుకలన్నీ బాబా మిత్రుల కందరికీ పంచి పెట్టారు. ఎలాంటి కష్ట సమయంలో యివన్నీ సమకూరాయో కదా! అని బాబా వ్యాఖ్యానించారు. మిత్రులు కూడ తమ ఆశ్చర్యాన్ని ప్రకటించారు. ఆపద కాలంలో, సరియగు సమయానికి, అవసరమైన వస్తువులు అనుకోని వ్యక్తికి ప్రేరణ కలిగి పంపబడి యీవిధంగా రక్షింపబడ్డారు.

దీనినిబట్టి నవజీవనంలో బాబా ఆంతరంగిక ప్రేరణ ఎలా పని చేసేదో విదితమవుతుంది.

ఆయన మారువేషంలో మసలుతున్నా, ఆయనయొక్క అధికారము ఏరకంగా పొందుపరచబడినాయో మరికొన్ని సంఘటనలు ముందు ముందు చెప్పుకుందాం. ఆయన ఏ ఒక్కరినీ, ఫలానా పని చేయమని ఆదేశించకుండానే, ఏ వ్యక్తినీ పేరుపెట్టి పిలవకనే, ఎవరో ఒకరిచేత, తన స్పష్టమైన ఆకాంక్ష తీర్చునట్లు, సమయాని కవుసరమగునవి సమకూర్చునట్లు, ఆయన శక్తి ఎలా పనిచేసేదో తెలియగలదు. మిత్రులకు అవుసరపడినప్పుడు, ఆ వస్తువులు సమయానికి సమకూరేవి. అట్టి చర్య వత్తిడివలన కానీ, బాహ్య ఆజ్ఞల వలనకానీ, ఆదేశాల వలనకానీ జరగలేదు.

అంతరంగిక ఆజ్ఞలై, ప్రేరణ కలిగించే వనుటలో సందేహం లేదు.

## విచిత్ర జీవనం

మొరాదాబాదులో మకాం చేసినకాలం విశ్రాంతి సమయం. వారికి రోజూ భోజనం కేవలం శాకాహారం మాత్రమే. టాంగాలో హోటలునుండి తేబడేది. ఒక రోజున డా॥ ఘనీ, "చెత్తలాంటి యీ కూడు నాకు తృప్తిగాలేదు" అని వ్యాఖ్యానించాడు. "ఇది విరామకాలం కదా! ఈ సమయంలో మాంసాహారాన్నెందుకు తీసుకోకూడదు?" అని అన్నాడు. అదివిన్న బాబా అతనివైపు చూచి, "ఈరోజు నీకు వచ్చిన హోటలుకు వెళ్ళి నీకిష్టమైనన్ని ప్లేట్లు మాంసాహారం కడుపార తిన" మని అనుజ్ఞ యిచ్చారు.

మిత్రులలో డా॥ నీలూ పూర్తి శాకాహారి. అతని జీవితంలో మాంసాహారం తిని ఎరుగడు. ఈ కారణంచేతనేనేమో, బాబా నీలూను ఘనీతో వెళ్ళి అతనేమితింటే అందులో ప్రతిదీ కాస్త రుచి చూడ ఆదేశించారు. యిది నీలూపాలిట అగ్నిపరీక్ష. కానీ విధేయత, అతనికి బాబాయందున్న ప్రేమలో చొప్పించబడి యున్నందున యీ పరీక్షను అతను సంతోషంగా ఎదుర్కొన్నాడు.

ఆ మర్నాడు క్రిస్టమస్ పండుగ. ఘనీ ఒక పెద్ద హోటలుకు వెళ్ళి, తన కిష్టమైన మాంసాహారాన్ని కడుపార భుజించాడు. తర్వాత రోజున బాబా, ఘనీ మాంసాహారం తిని నిజంగా

ఆనందించాడా అని ఆరా తీశారు. ఎన్ని రకాల వంటకాలు తిన్నాడు, ఏమేమి తిన్నాడు వగైరాలన్నీ వివరం చెప్పమన్నారు.

అందుకు ఘనీ చెప్పుకుపోయాడు. "నేను ఏటమాంసం, కోడిమాంసం, చేప వగైరా కూరల రకాలు తిన్నాను." అంటూ ఉండగా "చాలా బాగుంది" అన్నారు. "నీవు నా ఆజ్ఞ పాలించావు. నాకు సంతోషంగా వుంది. ఈరోజు నీకు మరో ఆదేశమిస్తున్నాను. యీరోజు అదే హోటలుకు, నీ కఫ్నీ ధరించి, వెళ్ళి భిక్ష అడిగిరమ్మ"న్నారు.

ఘనీ బాబా ఆదేశాన్ని స్పోర్తిప్రగా తీసుకున్నాడు. ఏ మాత్రం బిడియపడలేదు. కఫ్నీ ధరించి, అదే హోటలు ముందుకు వెళ్ళి భిక్ష నర్ధించాడు. హోటలు మేనేజరు ఆశ్చర్యపోయాడు. అంతక్రితంరోజు బహుమతిగా చిల్లరడబ్బులు పొందిన సర్వరులు ఆశ్చర్యపోయారు. నిన్నవచ్చి ఖరీదైన విందు భోజనం చేసి, బహుమతులుకూడ యిచ్చిన పెద్దమనిషి యీవేళ "సోదరా! భిక్ష పెట్టు" అంటున్నాడేమిటా? అని సంభ్రమాశ్చర్యాలు పడ్డారు.

పరిపూర్ణ మిత్రుని హాశ్యం, అతని విధేయత, దైవంతో అతనికున్న మిత్రత్వం, యివన్నీ ఎవరికి తెలుస్తాయి? ఎవరు తెలుసుకోగలరు. ఏమైతేనేమి ఘనీ తనవంతు బాధ్యత విధేయతతో నిర్వర్తించి బాబా ఆజ్ఞను తు. చ. తప్పక పాలించాడు. అందుకు బాబా ఆనందించారు. తరువాత బాబా వైదులును,

అలోబాసు కూడ మాంసాహారం తినుటకు అనుమతించారు. అయితే వారికి దానిమీద భ్రాంతిలేదు కనుక వారిని మళ్ళీ అదే హోటలుకు ముష్టికి పంపలేదు.

## అకుంఠిత దీక్ష

జాన్‌పూరులో హస్తోదకంతో మిత్రులవద్దనుండి పొందిన పైకాన్ని యీ పదిరోజులు విరామ కాలంలో భోజనాలు వగైరాలకు వినియోగిస్తున్నారు. నిజానికి బాబా దగ్గర ఒకప్పుడు డబ్బుండేది. అవసరం వచ్చినప్పుడే చాల అరుదుగా దాన్ని ఖర్చుచేస్తూ వచ్చారు. ఇప్పుడు ఆ పైకమంతా ఖర్చయిపోయింది. బాబా యదార్థ ఫకీరు. ఆయనకేమీ లేదు. బాబా ప్రియతముడైన దైవం. ఆయనవద్ద అత్యంత విలువైన, అనంత ప్రేమ అనే సంపద ఉన్నది. అందులో ప్రాపంచక సంపదకు స్థానం లేదు. అందుకే ఆయన నిత్య నిరంతర ఫకీరు.

బాబాతో జీవించడమంటే తమాషా కాదు. అట్టివారికెన్నో అర్హత లుండాలి. ఫ్రాన్సిస్ బాబా జాన్ అంటాడు ప్రేమమార్గం చేరాలంటే ముఖ్యమైన కావాల్సిన అర్హతలు ఎలా ఉండాలంటే —

"సుడిగాలి ఒకరికి స్వార్థాన్ని సర్వ నాశనం చేసేదైతే, మరొకరికి పిల్లవాయువులా వుంటుంది.

హృదయవిదారకమైన కష్టా లనుభవిస్తున్నా అట్టివారి ముఖంలో చిరునవ్వు తాండవిస్తుంది.

అతడు ఎడారిలోకానీ, సముద్రంలోకానీ, శిఖరాగ్రంపైన కానీ పయనించు సామర్థ్యము కలిగి వుంటాడు.

అతడు ఒకే సమయంలో సింహంగానూ, మేకపిల్లగాను ఉంటాడు.

అతడు, తన గమ్యాన్ని చేర్చే గురువును చేరి కలుసుకుంటాడు."

## జిప్సీ జీవనము

పదిరోజుల విరామ కాలము ఆనందంగా గడిచిపోయింది. అది 1950 జనవరి ఒకటవ తేదీ నూతన సంవత్స రారంభం. ఉదయాన్నే లేవగానే బాబా అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్ష లందచేశారు. అందరికీ తలాఒకముక్క కేకు పంచారు. విరామకాలం పూర్తైంది కనుక, మకాం మార్చి కాలినడకన ప్రయాణం ముందుకు సాగాలని నిర్ణయించారు. పక్క చుట్టలూ యితర సామాన్లన్నీ బళ్ళమీద సదిరారు. మధ్యాహ్నం మిత్రులంతా తెల్ల దుస్తులు ధరించి, పచ్చ తలపాగా పెట్టుకొని, మొరాదాబాదు దాటి కొన్నిమైళ్ళు వెళ్ళారు.

ఆనాడు సూర్యుడు బాగా వెలుగు నిస్తున్నాడు. సాయంత్ర మయ్యేసరికి మబ్బులు కమ్మి, నల్ల మేఘాలు ఆవరించాయి. రాత్రికి వర్షం ప్రారంభమైంది. వారంతా తగుచోటు చూచుకొని విశ్రాంతి ఏర్పాటు చేసుకొన్న తదుపరి వర్షం ఆగింది.

కురిసింది కానేపైన మంచివర్షం పడ్డది. బాబాకు వేసిన డేరాలో ఆయన బెడ్డింగంతా తడిసిపోయింది. పాపం, ఏ ఆచ్ఛాదన లేక ఆరుబయలులోనే వుండిపోయిన మిత్రుల సంగతి మనం వూహించుకోవలసిందే. మర్నాడు మళ్ళీ నడక సాగించి హర్యానాలో ఆగారు. అలా రోజు కో ఊరు చొప్పున, అమ్రోహా లోను, రతన్‌ఘర్‌లోను ఆగుతూ జిప్సీ జీవనం గడిపారు.

ఈ ప్రయాణంలో మిత్రులు కొందరు ముందుగానే ఆగబోయే చోటుకు చేరి అనువైన స్థలం సిద్ధం చేసేవారు. జంతువులు, బళ్ళు, బృందం, యివన్నీ వుండేందుకనువైన ప్రదేశాన్ని ఎంపిక చేసేవారు. వారు టాంగాలో వెళ్ళేవారు. దానిని బైదులు తోలేవాడు. రాత్రిళ్ళు చలి పోగొట్టుకుందుకు నెగళ్ళు వేసుకొనేవారు.

## దైవమానవుని దాహం

బాబా ముందు దారితీసేవారు. ఈరుచ్ ఆయనను అనుసరించేవాడు. కాస్త వెనుకగా మెహెరా, మణి, మెహెరూ, గోహెర్ వుండేవారు. వాళ్ళ వెనుక ఫర్లాంగు దూరంలో తక్కిన పురుషు లుండేవారు. బాబా కొరకు స్త్రీలు, ఫ్లాస్కులో నీళ్ళుంచుకొనేవారు. అది చలికాల మైనందువ వాళ్ళు ఒకరోజున, నీటి అవసరం వుండదనే భావంతో ఫ్లాస్కులో నీళ్ళు తేలేదు. రోజూ తెస్తున్నా ఆరోజున మానివేశారు.

ఆరోజున ప్రొద్దుటే బాబాకు విపరీతంగా దాహం వేసింది. పాపం స్త్రీలు చాల బాధపడ్డారు. ఆనాడు నీళ్ళు తేనందున మిగుల విచారించారు. వాళ్ళు నిస్సహాయులుగదా। సరిగా అదే సమయంలో అటువైపు పొలాల్లోని నూతినుండి ఒకవ్యక్తి నీరుతోడి రోడ్డువైపు తెచ్చుట బాబా గమనించారు. అతనివద్దకు వెళ్ళి కాసిని మంచినీళ్ళు అడిగి తెమ్మని యీరుచ్‌ని పంపారు.

బాబా ఆజ్ఞను వెంటనే ఆచరణలో పెట్టాడు ఈరుచ్. పరుగున వెళ్ళి ఆ వ్యక్తిని కలిశాడు. ఈరుచ్ బయలుదేరబోయే ముందు బాబా అతని కాళ్ళకు వంగి నమస్కరించి, నీరిచ్చిన ఆ వ్యక్తి కాళ్ళకు ఆవిధంగా ప్రతి నమస్కారం తన తరఫున చేసి, అతనికి తన కృతజ్ఞత తెలుపమన్నారు. ఈరుచ్ వెంటనే వెళ్ళి ఆరైతుని మంచినీళ్ళివ్వమని అర్థించి, బాబా చేసినట్లే అతని కాళ్ళకు వంగి నమస్కరించి, బాబాకు బదులుగా ప్రవర్తించాడు. అంటే ఇవన్నీ కర్మ బాకీ లన్నమాట.

## వివేకము - విచక్షణ

ఇదే బాబా ఒకసారి తన ప్రేమికులతో ముచ్చటిస్తూ యిలా వివరించారు. "కొందరు నా శిష్యులద్వారా నన్ను గురించి తెలుసుకోగలుగుతారు. దైవముయొక్క మానవ స్వభావాన్ని అందరూ అర్థం చేసుకోలేరు. మానవరూపధారియైన దైవాన్ని అనుసరించుట కడు దుర్లభం. అయితే దైవ మానవునికి తెలుసును. ఎవరికి ఎప్పుడు తనయందు విశ్వాసం కలిగించాలో

ఎరుగును. నన్ను తెలుసుకొనుటకు ప్రయత్నించకుడు. నా లోతు కొలువశక్యం కానిది. కేవలం నన్ను ప్రేమించండి. అప్పుడు అర్థం చేసుకొనుటకు ఏమి కావాలో మీరు తెలుసుకో గలుగుతారు."

యివన్నీ నవజీవనంలోకూడా బాబా తన అధికారిక అను భూతులను అందించిన సంఘటనలు. అప్రయత్నంగానే వూహించని రీతిలో ముక్కు మొఖం ఎరుగని వారిచేత ఎలా పని చేయించి, తన ఆశీర్వాదాన్నందించేవారో వివరిస్తవి.

మళ్ళీ బాబా బృందం హర్యానా నుండి రతన్‌పూర్ వైపు సాగుతోంది. ఈనడక సమయంలో ఒక్కొక్కప్పుడు సూర్యో దయం కాగానే, పల్లెల్లో పూరిపాకలనుండి పొగ రావడం, మిత్రులు గమనించేవారు. స్త్రీలు ఆసమయంలో వంట చేస్తున్నా రనటానికది నిదర్శనం. అలాంటి కొన్ని సందర్భాల్లో ఈరుచ్‌ని వెళ్ళి భిక్ష సేకరించి, ప్రధానమార్గంలో తమను త్వరగా వచ్చి కలువమని ఆదేశించేవారని యింతకుముందు భాగంలో కూడ తెలుసుకున్నాంకదా!

భిక్షాటనలో ఈరుచ్ అనుభవాలు వినటానికి చాల హుషా రుగా ఉంటయి. భవనాల్లో ఉండేవారికి దానగుణం అధికంగా వుండదని అతని అనుభవం. కానీ పల్లెల్లో వుండేవారు, తమకున్న దాంట్లో లేదనకుండా భిక్ష పెడతారని అనుభవమైంది. అలా ఒకరోజున ఒకింటికి వెళ్ళి భిక్ష అర్థించాడు. ఆయింటి యజమాని చెరుకురసం తీస్తున్నాడు. అతడు భిక్ష అడుగగానే ఒక కుండ

నిండా పోసి భిక్షగా చెరకురసం సమర్పించాడు. మోయలేక మోసుకువెళ్ళి దానిని బాబాకు సమర్పించగా ఆనందంతో ఆయన అందరికీ పంచారు.

మరోసారి ఒకవ్యక్తి, తన ముంగిట భిక్ష నర్థిస్తూ నిలచిన ఈరుపాను చూచి, భిక్షాటన చేయవద్దని బ్రతిమలాడాడు. పైపెచ్చు తన కూతురునిచ్చి వివాహం చేసి అల్లునిగా స్వీకరిస్తాను; తన యింట ఉండిపొమ్మని ప్రాధేయపడ్డాడు. ఈమాదిరే, వేరొక ఉదాహరణ జరిగింది. దానిని గురించి వివరిస్తాను. తరువాత మణిలీ నజీబాబాదు చేరుటకుగాను బృందమంతా కాలినడకన ముందుకు సాగుతున్నారు.

## మెహెర్ మందారము

బాబా ఎప్పుడూ భిక్షకు అత్యంత ప్రాధాన్యత యిచ్చేవారు. ప్రేమతో పెట్టిన భిక్షను మహాప్రసాదంగా అందరికీ పంచిపెట్టే వారు. మిత్రులదే పంచభక్ష్య పరమాన్నాలతో కూడిన విందు భోజనంగా తిని కడుపు నింపుకొనేవారు. రతన్‌ఘర్ ఊళ్ళో బాబా భిక్షాపాత్ర, చంకలో జోలె ధరించి స్వయంగా భిక్షకు వెళ్ళారు. ఈ పరిపూర్ణమైన యాచకుని సత్కరించే యాచకు లెవరో ఆ భగవంతునికే తెలియాలి.

అది జనవరిమాసం. ఉత్తర భారతంలో చలి విదిలించే శీతాకాలం. రాత్రిళ్ళు మిత్రులు తల దాచుకొనే ఆచ్ఛాదన

ఉండేదికాదు. కొందరు ఆరుబయటే పడుకొనేవారు. కొందరైతే చెట్లక్రిందో, చేమలక్రిందో ఏ అచ్ఛాదన దొరికితే దానిక్రింద పడుకొనేవారు. రతన్‌ఘర్‌లో చలి వేయకుండా వుండేందుకు సమీపంలోని ఒక దేవాలయం ప్రక్కన, ఒకరోజు రాత్రి అలోబా డా॥ నీలూాలు పడుకున్నారు. వారిమకాం కది కొంచం దూరంలో వుంది. ఆరాత్రి అన్నా 104 బాబా డేరావద్ద కావలి ఉన్నాడు. అర్ధరాత్రి అన్నా యీల వూదాడు. బాబా ఆదేశం మేరకు, అత్యవసర సమయంలో అలా యీల వూదగానే, మిత్రులంతా బాబా డేరాదగ్గరకు రావాలి.

అలా అన్నా వూదిన యీలవిని మిత్రులంతా పరుగున డేరా దగ్గరికి వచ్చారు. కానీ, అన్నా పొరపాటున ఈల ఊదా డని తర్వాత తెలిసింది. ఏమీలేకుండా యీల ఊదినందుకు ఏం జరుగుతుందోనని అన్నా వణికిపోయాడు. తమకు నిద్రాభంగం చేశాడని అన్నాను అంతా తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.

మర్నాడు ఉదయం "రాత్రి ఈ హాస్య సంఘటన జరిగినప్పుడు అంతా వచ్చారా?" అని అడిగారు బాబా. నీలూ, అలో బాలు, తాము గాఢ నిద్రలో ఉన్నందున రాలేకపోతిమని తమతప్పు ఒప్పుకున్నారు. విషయం విన్న బాబా వారిరువురిపై అసంతృప్తి చెంది మందలించారు. "నేనిచ్చే ఆజ్ఞలు పాటించలేనప్పుడు నన్ను మీ ర్లెల అనుసరించాలి? మీరెందుకూ పనికిరారు!" అన్నారు.

న్యాయానికి వారు బాబా ఆజ్ఞలు ఉద్దేశపూర్వకంగా ధిక్క-రించక పోయినా, అలోబా ప్రకృతి సహజమైన మూఢాచార పరాయణుడైనందున, బాబా మాటలను హృదయానికి తీసుకున్నాడు. అతడు ఉద్రేకంలో తమాయించుకోలేకపోయాడు. బాబాను సంతోషపెట్టలేక పోయానన్న ఆలోచనను భరించలేకపోయాడు. తన సంక్షోభాన్ని బయటకు వ్యక్తపరచలేక పోయాడు. బాబాకు బరువయ్యేకంటె మరణించుట మేలని ఆత్మహత్యకు నిశ్చయించాడు.

ఆరాత్రి వెన్నెల బాగా వుండుటచేత, అతనికి మరుగు దొరకలేదు ఆత్మహత్యకు. అర్ధరాత్రి మబ్బులు వచ్చి వెలుతురు కొంత మరుగైంది. మెల్లగా లేచి, సమీపంలోని ఒక నూతి దగ్గరకు వెళ్ళాడు. నూతిగట్టుపై కెక్కి ఆత్మహత్యకు సిద్ధంగా ఉన్నాడు. తుదిక్షణంలో బాబాయొక్క కృపాకటాక్షం అతని హృదయాన్ని తట్టి లేపింది. తన నిర్ణయాన్ని పునరాలోచించుట మొదలెట్టాడు.

అతడీవిధంగా మథనపడసాగాడు. "తన జీవితం సమాప్తం చేసుకుంటే, అది బాబా భారాన్ని తగ్గిస్తుందా పెంచుతుందా? బహుశః పోలీసు విచారణ జరుగవచ్చును. అదంతా నవజీవనం గడిపే బాబాకు అసభ్యంగా పరిణమించవచ్చును." అలా అనుకుంటూ, తాను ఆత్మహత్యంటూ చేసుకొంటే, నవజీవనం గడిపే బాబాకు భారం తగ్గేబదులు అనేక చిక్కులు కల్పించవచ్చును అని గుర్తించాడు. అప్పుడు అలోబా తన జీవితం

తుదముట్టించుకోవాలన్న తలంపుతో ఉన్నాడు. చివరకు ఆ తలంపు విరమించుకొని, ఆత్మహత్య మానుకొని, తన రెండు చెవడలపైనా గట్టిగా ఏబదిసార్లు దబదబా బాదుకున్నాడు.

తేలికపడిన మనస్సుతో మళ్ళీ తన పక్కమీద చేరి పడుకున్నాడేకానీ నిద్దుర పట్టలేదు. మిత్రులెవరికీ తన మానసిక వ్యథను బయటపెట్టలేదు. కానీ వాచిన తన బుగ్గలు వారి దృష్టి నుండి తప్పించుకోలేకపోయినవి. మరునాడు ఉదయం బాబా మళ్ళీ తన ఆజ్ఞలకు మిత్రులంతా కట్టుబడి వుండాల్సిన అవసరం గురించి హెచ్చరించారు. సీలూ, అలోబాలవైపు చూచారు. ఆ చూపు వాళ్ళను మందలించాలనో, సముదాయించాలనో అన్నట్లు ఉన్నది. వారిరువురిని చెంతకు పిలిచి, గాఢాలింగనం యిచ్చారు. అనుకోకుండా జరిగిన వారి ఉల్లంఘనకు వారిని క్షమించామన్నారు.

ఆతర్వాత రాత్రింతా నిద్దరపోనివారెవ్వరని ప్రశ్నించారు. అలోబా తనచేతి నెత్తాడు. సర్వజ్ఞుడైన బాబా కారణ మడుగ లేదు. ఈరాత్రికి బాగా నిద్రపోవుటకు ప్రయత్నం చేయమని సలహా యిచ్చారు. బాబా అనతిమేరకు, రాత్రంతా నిద్రపోవా లని ప్రయత్నించాడు. కానీ నక్షత్రాలను కాపలా కాయుటే జరిగింది. ఎంత ప్రయత్నించినా నిద్ర రాలేదు. మళ్ళీ పొద్దుటే రాత్రి నిద్రపోయావా అని అడుగుతారేమోనని భయపడ్డాడు. అలాగే జరిగింది. మళ్ళీ తానే నిద్రపోలేదని చెప్పాల్సివచ్చింది.

ఏవిధమైన వివరణ అడగక, మళ్ళీ రాత్రి నిద్రపోవుటకు ప్రయత్నించమన్నారు. బాబా ఎడల చూపిన అవిధేయతనుండి

అతడింకా కోలుకోలేదు. మళ్ళీ యిప్పుడు మరో కొత్త సమస్య ఎదురైంది. యీరాత్రి నిద్రపో అనే ఆజ్ఞను పాటించలేక పోతున్నాననే వ్యధ పీడించసాగింది. అందువలన ఆరాత్రి కళ్ళకో రుమాలు గట్టిగా కట్టి చీకటిపడినప్పటినుండి ఉదయం వరకు నిద్రపోవాలని ప్రయత్నించాడు. గాఢనిద్ర పోవుటలో అతడు విజయం సాధించలేక పోయాడు.

అప్పుడూ నిద్ర తూలింది. లోగావాడు. తననుండి బాబా ఏమి కోరారో అది ఆచరించుట కొరకు ప్రయత్నించాడు. తనకు చాతనయినంత చేశాడు. ప్రయత్నం చేయమనేకదా బాబా చెప్పారు? మళ్ళీ అతని నిద్రగురించి బాబా ప్రశ్నించలేదు. బాబా ప్రేమాలింగనం క్షమించావన్న వాగ్దానం అతనిని క్రమంగా సేదతీర్చాయి. హృదయం తేలికైంది. ఒక పక్షం గడిచాక, మమూలుగా నిద్రలో పడ్డాడు.

మానసిక సంక్షోభాలు సమసిపోవాలంటే, కొంతకాలం పడుతుంది. అది పూర్వజీవనంకానీ, నవజీవనంకానీ, బాబా యొక్క అతి చిన్న అయిష్టతనుకూడ భరించడం ఊహాకందనిది. బాబాయొక్క ప్రతి చర్యను శిష్యులు దైవత్వముయొక్క నిస్వార్థ ప్రకటనలుగా గౌరవించేవారు. అందుకే బాబాను సంతోషపెట్టలేకపోతే భగవంతుని ధిక్కరించినట్లుగా భావించేవారు.

## నజీబాబాదు పయనము

రతన్‌ఘర్‌లో మూడురోజులున్న తరువాత నజీబాబాదు పయనమైనారు. ఆదీని, ఘనీని, బాబాదాసుని అనువైన ప్రదేశం

వేదకి ఏర్పాటు చేయమని, ముందుగా రైలుపై నజీబాబాదు పంపారు. ఆ సంవత్సరంలో అది అతి శీతల సమయం. నజీబా బాదులో బాబా బృందాని కవుసరమగు వసతి సౌకర్యాలు ఏర్పాటు చేయుటకు కొన్ని షరతులు విధించి, ఆదీ, ఘనీ, బాబాదాసు లను ముందుగా నజీబాబాదుకు పంపారు. ఈ క్రింది షరతు లతో ఏర్పాట్లు చేయమన్నారు.

1. స్త్రీలు, పురుషులు, తమ సామాన్లు, జంతువులు, బళ్ళు వగైరాలన్నీ మూడు రోజులపాటు దగ్గరగా ఒకే ప్రదేశ ములో ఉండాలి. సాధ్యమైనంతవరకు వేన్నీళ్ళ ఏర్పాటు బృంద మంతటికీ ఏర్పాటు కావాలి.

2. భిక్షగా పుదయం ఫలహారం; మధ్నాహ్నం, రాత్రి భోజనం; పొద్దున, సాయంత్రం టీ, మిత్రులందరికీ సరఫరా కావాలి.

3. మిత్రులందరికీ నజీబాబాదునుండి డెహరాడూన్‌కు రైలు టిక్కట్లు ఎవరో ఒకరిచే కొనిపించే ఏర్పాటు చేయాలి.

ఈ పై మూడు షరతులు చూచుటకు వింతగా అనిపించ వచ్చును. సద్గురువు ఆజ్ఞ పాలించుటలో ఎంతటి విచిత్ర సమస్య లైనా యదార్ధ సంఘటనలుగా జరిగిపోవును. బాబాపై భారం వేసి ఆదీ, ఘనీ, బాబాదాసులు నజీబాబాదు బయలుదేరారు. వారి దారి ఖర్చులకు, పట్టణంలో తిరిగేందుకు అయ్యే ఖర్చుల క్రింద కొంత పైకం యిచ్చారు. కానీ ఆ డబ్బులో ఒక్క

పైగా కూడ, తమ భోజనానికిగానీ, కనీసం సోడా త్రాగటానికి కూడ వినియోగించకూడదని ఆదేశించారు. హుస్సైనాబాదనే ఊళ్ళో వుండగా వారి ప్రయాణం మొదలైంది. వెళుతూ తమతో అన్నం పట్టుకెళ్ళారు. అది తిన్నాక, వాళ్ళకు ఆకలైతే భిక్షాటన చేసి భోంచేయమన్నారు.

## ఆజ్ఞా పాలన

ఈ ముగ్గురు తెచ్చుకున్న ఆహారం, బాగా ఆకలగుట వలన, రైల్లోనే తినేశారు. నజీబాబాదు వారెప్పుడూ వెళ్ళలేదు. అంతా కొత్తగావుంది. కడుపులో నకనక లాడుతోంది. ఎక్కడికి వెళ్ళాలో, ఎవరిని కలవాలో అర్థం కాలేదు. మరునటిరోజు ఉదయానికి తమపని పూర్తి చేసుకొని, మరలా బాబాను కలవాలి.

ముందు ఒక ధర్మశాలకు వెళ్ళి, దాని మేనేజరుతో మాట్లాడి ఒకగది తీసుకున్నారు. ఘనీ గుండెజబ్బువున్న మనిషి. ఆరోజు హఠాత్తుగా అస్వస్తత కలిగింది. కదలలేనని మంచమెక్కాడు. బాబాదాసుకు సెమాటికానెప్పి వచ్చింది. అదీతో ఊళ్ళోకి రాలేనని అతడూ మంచమెక్కాడు. ఆదీకి తప్పలేదు బాబా అజ్ఞా పాలన.

ఓ టాంగా అద్దెకు తీసుకొని ఊళ్ళోకి బయలుదేరాడు. పేరు ప్రతిష్టలున్న పెద్దమనుషుల యిళ్ళకు తీసుకువెళ్ళమని టాంగావాలాకు పురమాయించాడు. ఎందరినో కలశాడు. కానీ

ఎవరూ ఆ మూడు షరతులు పాటించుటకు ముందుకు రాలేదు. ముక్కూ మొఖం తెలియనివారికి సహాయ మేమిటన్నట్లున్నది వారి ధోరణి.

చివరగా, మక్కన్‌లాల్ అనే వస్త్ర వ్యాపారి దొరికాడు. అతనికి తన మూడు షరతులు వినిపించేసరికి, నీ షరతులేమో నాకు తెలియదుకానీ, నేనుమాత్రం మూడురోజులు కాదు మూడు వారాలైనాసరే టీ, భోజన ఫలహారాలు సరఫరా చేస్తా నన్నాడు. కొంతలో కొంత మేలని, ఆదీ అందుకు అంగీకరించి, తమ బృందం రాగానే వారుండే చోటు, వచ్చి చెపుతానని, తక్కిన షరతులు తీర్చే మనిషికోసరం మళ్ళీ బయలుదేరాడు.

ఆతడొక టోకు వ్యాపారిని కలిశాడు. ఆయన 'కాచు' వ్యాపారం చేస్తాడు. ఆయన, ఆదీ కోరినట్లు డెహరాడూన్‌కు టిక్కట్లు కొనిస్తా నన్నాడు. దీనివివరాలు ముందు చెప్పుకుందాం. రెండు సమస్యలు తీరినందుకు ఆదీ హృదయం తేలికపడింది. వసతి సమస్య మిగిలున్నది. ఎంత తిరిగినా ఫలితం కనిపడలేదు. స్టేషనుకు తిరిగి వెళుతున్నాడు.

దారిలో పోషణలేని తోట ఒకటి కనపడింది. దానిమధ్య విశాలమైన చప్టావుంది. అది చూడగానే తమ బెడ్డింగులా చప్టాపై వేసుకొని పడుకోవచ్చనుకున్నాడు. దాని యజమాని ఎక్కడ దొరుకుతాడా అని అటూ యిటూ చూస్తుండగానే ఒకాయన అటుగా వచ్చి, 'ఎవరు మీరు ? అన్నాడు. ఆదీ విషయంచెప్పి తామంతా హరిద్వార్ వెళుతున్నాం. తమ బృందం మర్నాటికి

నజీబాబాదు చేరతారు. ఇక్కడ తామంతా మూడురోజులుపాటు ఉంటాం. అందు కనువైనచోటు వెదుకుతున్నాను' అన్నాడు.

బాబు॰ యీతోట యజమానిని నేను. తోటలోని విశాల ప్రదేశం మీకు సరిపోతే, నిరభ్యంతరంగా మీరు యిందులో ఉండండి. తలుపు తీసుకొని లోనికివెళ్ళి చూచిరమ్మన్నాడు. అనుకోనివిధంగా మూడు షరతులు నెరవేరినందుకు ఆదీ మహదానంద పడ్డాడు. ఆ ఆనందంతో ధర్మశాల చేరేసరికి, ఆరోజు భోజనం లేనందున ఆకలితో అలమటిస్తూ, ఘనీ, బాబాదాసులు బలహీనంగా కనపడ్డారు. హోటలు భోజనం పనికిరాదు. ఎక్కడైనాసరే భిక్షలోనే తేవాలి. పగలంతా తిరిగి వున్నందున, ఆదీ అలసిపోయి ఉన్నాడు. భిక్షకువెళ్ళే ఓపిక లేదు.

బయట టాంగావాలా డబ్బులుకొరకు నిరీక్షిస్తున్నాడు. ఆదీ బుర్రలో ఓ ఆలోచన తళుక్కుమన్నది. "నీ కెంత డబ్బివ్వాలి" అన్నాడు. "పది రూపాయ లివ్వండి" అని అడిగాడు. "నీవు నిజంగా ఈరోజు నాకెంతో సహాయపడ్డావు. నీకేమిచ్చినా ఋణం తీరదు. యింద! ఈ యిరువది రూపాయ లుంచుకో!" అని రు. 20-00 లు యిచ్చాడు. పాప మా టాంగావాలా అంతడబ్బు వూహించలేదు. ఆశ్చర్యంతో "అయ్యా! ఇది చాలా అధికం. యింత కిరాయి అక్కర్లేదు. యింకా ఏమైనా చేయమంటే చేస్తాను" అన్నాడు.

"నీవు నిజంగా యింకా ఏమైనా చేయాలంటే, మా ముగ్గురికీ భిక్షగా అన్నం తెచ్చిపెట్టు! చాలు" అనడిగాడు.

“ఏమిటిసార్? మీరనేది. మీరు కావాలంటే, మీ ముగ్గురికీ హోటలునుండి క్యారియర్ తెస్తాను. అంతేకానీ, ‘ భిక్ష ’ అంటా రేమిటండీ? ” అన్నాడు. లేదుబాబు. నేను నిజంగానే చెప్పాను. డబ్బిచ్చి మేము భోంచేయరాదు. అది మా నియమం. భిక్షగా పెట్టిందే తినాలి ” అన్నాడు.

అప్పుడా టాంగావాలా ఆ ముగ్గురికీ సరిపడినంత అన్నం తెచ్చి భిక్షగా పెట్టాడు. అర్ధరాత్రి అయ్యేసరికి ఘనీకి, మళ్ళీ రెండోసారి గుండెలోనొప్పి వచ్చింది. ఆదీని లేపి హీనస్వరంతో తనబాధ చెప్పాడు. ఘనీ వణికిపోతున్నాడు. ఆ స్థితిలో ఆదీ అధైర్యపడక, ధైర్యంతో ఘనీ గుండెనిమురుతూ, కూర్చున్నాడు. అర్ధరాత్రి, కొత్తచోటు, ఆదీకి ఏమీ తోచలేదు. వైద్య సదుపాయము కుదరలేదు. చేసేదిలేక, ఘనీతో “బాబాను హృదయపూర్వకంగా జ్ఞాపకం పెట్టుకో. ఆయన నామాన్ని స్మరించు” అని జ్ఞప్తి చేశాడు.

బాబా, బాబా అంటుండగానే, అదేం మహత్తో క్షణాల్లో నెప్పి తగ్గింది. వెంటనే నిద్రపోయి గురకపెట్టసాగాడు. ఉదయానికల్లా బాధలన్నీ తగ్గాయి. ముగ్గురూ లేచి, బాబా బృందానికి స్వాగతం చెప్పుటకు, ఊరిబయటకు వెళ్ళారు. కొద్ది సేపట్లో బాబా, మిత్రులతో రానేవచ్చారు.

తాము చేసిన ఏర్పాట్లన్నీ బాబాకు వివరించారు. తోటలో ఏర్పాట్లు బాబాకు నచ్చకపోయినా తక్కిన ఏర్పాట్లకు మెచ్చుకున్నారు. బృందమంతా తమకు ఏర్పాటుచేసిన తోటకు చేరారు.

ఆదే మకన్‌లాల్ దగ్గరకు వెళ్ళి, భోజనాన్ని ఫలానా తోటకు పంపమని చెప్పి వచ్చాడు.

కొద్దిసేపట్లోనే అతడు బృంద మందరికీ చక్కని పదార్థాలతో భోజనం, తోట దగ్గరకు తెచ్చాడు. అదే ఆయనను బాబా దగ్గరకు తీసుకువెళ్ళి పరిచయం చేశాడు. ఆ దివ్యమంగళ రూపాన్ని చూచేసరికి, మక్కన్‌లాల్ వంగి ఆయన పాదాలకు నమస్కరించాడు. సంతోషించిన బాబా అతని భోజనాన్ని అంగీకరించారు. మరునాడు మక్కన్‌లాల్ కుటుంబాన్నికూడ తోటకు వచ్చుటకు అనుమతించారు.

## సక్కూ తక్కూల అమ్మకం

దారివెంట బృందము రెండు ఆడ గాడిదలు సక్కూ, తక్కూలు మూలంగా కష్టాలు పడ్డారు. ఈ నజీబాబాదులో రెండు గాడిదలను బాబా అమ్మదలచారు. సదాశివపాటిల్‌ని, బజారుకు తీసుకెళ్ళి ఆ రెంటినీ వేలంలో అమ్మమన్నారు. మొదటి రోజున, చాల తక్కువ ధర వచ్చుటచేత తిరిగి తీసుకెళ్ళారు. రెండోరోజున బాబా స్వయంగా ఒక ధర నిర్ణయించి అంతకు తక్కువ కాకుండా, ఎక్కువ కాకుండా అమ్మకు రమ్మన్నారు. ఆరోజున నిర్ణయించిన ధరకు కొనుటకు ఎవరూ ముందుకురాలేదు. మళ్ళీ సదాశివపాటిల్ అపజయంతో తిరిగివచ్చాడు.

మూడవరోజున, ఒకవ్యక్తి బాబా నిర్ణయించిన పైకం చెల్లించి, సక్కూ తక్కూలను కొని తోలుకెళ్ళిపోయాడు.

బహుశః బాబా యీవ్యక్తికే వాటి నివ్వదలచారేమో? అందుకే మూడురోజులు ఆలశ్యమైంది వాటి అమ్మకానికి. అంతా దైవేచ్ఛ కదా! అనూహ్యామైన నవజీవన బేరం!

ఆరోజు ఆదీ తోటముందు గేట్లోవుండగా, ఓ ఆగంతకుడు వచ్చి మీరంతా ఎవరు? నా తోటలో ఎవరి పర్మిషన్‌తో వున్నారని అడిగాడు. ఆదీ ఆశ్చర్యపడినా జరిగింది చెప్పాడు. అందుకా వ్యక్తి, ఈతోటను మొదటవానినుండి కొనుగోలు చేసినట్లు, అయినా అతడు వప్పగించనందున, కోర్టులో దావా వేసినట్లు చెప్పాడు. అంత ఆదీ బాబాతో చర్చించి, యజమానికి తెలియకుండా ప్రవేశించినందుకు క్షమాపణ కోరి వెంటనే ఖాళీ చేస్తామని వివరించాడు.

ఈజవాబుతో ఆవ్యక్తి ఖిన్నుడై, తమయెడల అమర్యాదగా ప్రవర్తించినందుకు తననే క్షమించమని, తమ యిష్టంవచ్చినన్నిరోజులు, యధేచ్ఛగా తోటలో వుండమని ప్రార్థించసాగాడు. వాడిపోయిన ముళ్ళ కుసుమ కోమల పుష్పాల దరిచేర్చినట్లయింది. అంతా సుఖాంతమే!

## స్వీయ ప్రయోగాలు

నవజీవనంలో శారీరక శ్రమ అధికమైనందున కాకా బారియాకు గుండెపోటు వచ్చింది. రెండురోజుల క్రితం, డా॥ ఘనీకి కూడ గుండెజబ్బు చేసింది. ఈ జిప్సీ జీవనంలో,

సౌకర్యాలు, అసౌకర్యాలు త్వరత్వరగా చేతులు మారాయి. మిత్రుల సుస్తీవలన, డెహరాడూన్‌వరకూ రైలులో పోవాలన్న బాబా నిర్ణయం ఖాయపరచుకున్నారు. కాకాబారియా సుస్తీ ఒక పెద్ద సమస్య అయింది. మిత్రులు తెచ్చే భిక్షను వండి, తినే ఆహారంగా తయారుచేసే పంతు కాకాబారియాది. అందుచేత బృందమంతా ఆయనపై ఆధారపడి ఉన్నారు. దీనికితోడు కాకా కోశాధికారి కూడ.

అందుకే బాబా, అతనిగురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. తన గుడారంలోనే వుంచుకున్నారు. ఆ జబ్బు ఎంతకీ తగ్గనందున, ముందుగా బాబా నిర్ణయించిన ప్రకారం, కాలినడకకు స్వస్తి చెప్పి, నజీబాబాదునుండి డెహరాడూన్ రైల్లో వెళ్ళాలని ఖాయపరచారు.

ఆదీని పిలిచి, నిన్న లోగా మాట్లాడిన ఆ "కాచు" టోకు వ్యాపారి దగ్గరకు వెళ్ళి బృందమంతటికీ రైలు టిక్కట్లు కొనే ఏర్పాటు చేసిరమ్మన్నారు. బాబా షరతులేమంటే, బాబాతోపాటు నలుగురు స్త్రీలకు మొదటి తరగతి టిక్కెట్లు, తక్కిన బృందానికి మూడవ తరగతి టిక్కట్లు కొని యివ్వాలి. ఆ టిక్కట్లు కొన్న వారిద్వారానే రైలు బయలుదేరబోవు సమయంలో అందించాలి.

ఇన్ని టిక్కట్లు కొనివ్వగల ధర్మాత్ముని కలియుటకు యిద్దరు మిత్రులు బయలుదేరారు. పట్టణంలో అలా పోగా పోగా తమకోర్కె తీర్చే వ్యక్తిని కలిశారు. అతనితో తమ కోర్కె గురించి వివరించారు. ఆయనొక కాచు టోకు వ్యాపారి. వీళ్ళ

నెవరో వెనుకవుండి లోనికి తోండన్నట్లు అనుభవమైనది. ఆ ఆవేశంతో ఆ వ్యాపారి కార్యాలయంలోనికి వెళ్ళారు. వారగా వేసివున్న తలుపు తట్టారు. యజమాని అనుమతి పొంది లోని కేగి తమ కోర్కె చల్లగా బయటపెట్టారు.

## ప్రత్యక్ష ప్రభావము

అదేమోగానీ, ఆశ్చర్యం! వాళ్ళకోర్కెవిన్న యజమాని "దానిదేముంది? అదేమంత ఖర్చు? యిలాంటికోర్కె తీర్చేందు కయ్యే వ్యయానికి తానేమి బాధపడను. అలాగే కొనిస్తాను" అన్నాడు. తన గుమస్తాను పిలిచి, మొత్తం వారు కోరే టిక్కట్ల క్రింద ఎంత ఖర్చవుతుందో లెక్కవేసి చెప్పమన్నాడు. అతడు లెక్కవేసి, యింత అవుతుందని చెప్పగానే క్యాషియరుని పిలిచి, అంతపైకం వీళ్ళకివ్వమని ఆదేశించాడు.

"అయ్యా! మాకు పైకం వద్దు. మేము నగదు అంగీక రించం" అన్నారు మిత్రులు. "అయితే మీరెలా వెళ్ళగలరు? పైకం లేకుండా టిక్కట్లెలా కొంటారు?" అని అడిగాడు. అందుకు మిత్రులు, "ఈ పట్టణ పొలిమేరలో ఫలానాచోట మే మంతా మకాం చేశాం. మరి మా బృంద నాయకుడు మాకు కొన్ని ఆదేశాలిచ్చారు. మీరు వాటిని ఆచరిస్తే ఆయన చాల సంతోషిస్తారు. ఆ ఆదేశాలేమంటే, మీవద్దనుండి మేమెట్టి పైకం స్వీకరించరాదు. అందుకు భిన్నంగా, మీరు మీ మనిషిని పంపి, మాకు కావలసిన టిక్కట్లన్నీ కొనునట్లు ఏర్పాటు చేయాలి. మరి

అట్టి టిక్కెట్లన్నీ మేమంతా రైలెక్కే సమయంలో మాకు అందివ్వాలి " అని చెప్పారు.

" అయితే రైలెన్ని గంటలకు బయలుదేరుతుంది ? మీరు వెళ్ళే సమయం ఎప్పుడని ఖాయపరచారు ? " అని మళ్ళీ ప్రశ్నించాడు. రేపు తెల్లవారుఝామున నాలుగు గంటల బండికి వెళతామని చెప్పారు. " అహా ! మీరెక్కే రైలు డెహరాడూన్ వెళ్ళేదికదా ? అవునా ? అయితే సరి ! రైట్, రైట్ ! నేనలాగే, ఆబండికే టిక్కెట్లు పంపిస్తాను " అన్నాడు. ఆ టిక్కెట్లు తెచ్చే మనిషిని గుర్తించుటకు వీలుగా. తన మనిషిని పిలిచి, వారికి పరిచయం చేశాడు. రేపు ఉదయం టిక్కెట్లు తెచ్చేది ఇతనేనని చెప్పాడు.

అందుకు మిత్రు లెంతో సంబరపడిపోయి, ఆ శుభవార్తను బాబా కెరిగించుటకు వడివడిగా వెళ్ళి ఆయన చెప్పినపని పూర్తి చేసినట్లు వివరించారు. సంగతి విన్న బాబాకూడ ఎంతో ఆనంద పడ్డారు. యిక్కడ మన మొకటి ఆలోచించాలి. ఒకటి కాదు, రెండుకాదు 20 మూడవ తరగతి టిక్కెట్లు, అయిదు మొదటి తరగతి టిక్కెట్లు కొనిపించుటకు ఒక అపరిచిత వ్యక్తిని కలసి ఒప్పించుట అంటే సామాన్యవిషయ మేమీకాదు. అందుకు పట్టిన సమయంకూడ స్వల్పమే. వారికి కావలసిందేదో క్లుప్తంగా చెప్పారు. అది గట్టిగా 15 నిమిషాలు కూడ పట్టలేదు. అయితే అన్వేషణలో నడకమాత్రం ఎక్కువసేపు పట్టింది. అట్టి వ్యక్తిని

ఎంపికచేసి, జరగవలసిన కార్యక్రమమంతా చెప్పి, తగిన ఏర్పాటు చేయించుటకు మాత్రము కేవలం 15 నిమిషాలు పట్టింది.

మర్నాడు ఉదయం జనవరి 12-వ తేదీన అనుకున్న ప్రకారం బృందమంతా రైలెక్కి డెహరాడూన్ వెళ్ళిపోయారు. ఆయన తాలూకు మనిషి టిక్కెట్లన్నీ కొని తెచ్చి యిచ్చాడు. అయితే రైలు బాగా రద్దీగావుంది. ఇంకా తెల్లవారనందున బాగా చీకటిగా వుంది. సమయం మూడు గంట లయింది. రద్దీగావున్న రైల్లో, అధిక సామాన్లు వేసుకొని మూడవ తరగతి పెట్టెలో ఎక్కుట ప్రయాసైంది. అందుచేత మరికొన్ని మూడవ తరగతి టిక్కెట్లు మార్చి, మొదటి తరగతి టిక్కెట్లు కొనమని ఆదీని మళ్ళీ గుమాస్తా దగ్గరకు పంపాడు.

పాపమా గుమస్తా మారుమాట్లాడకుండా, తన యజమాని అనుమతి లేకుండానే మొదటి తరగతి టిక్కెట్లు మరికొన్ని కొని యిచ్చుటకు అంగీకరించాడు. నజీబాబాదులో ఎక్స్‌ప్రెస్ రైలు ఎక్కువసేపు ఆగదు. అందువలన గార్డుతో చెప్పి, మొదటి తరగతి టిక్కెట్లకయ్యే తేడాపైకం ఆదీకిచ్చి, టిక్కెట్టు కలెక్టరుకు రైల్లోనే చెల్లించమని ఒప్పగించాడు. ఆడవాళ్ళు హడావిడిగా మొదటి తరగతి పెట్టెలో పడ్డారు. సామానంతా అందులోనే సదిరారు.

తదుపరి హోటలులో, ఆదీ డబ్బు తీసుకున్న సంగతి బాబాకు తెలిసింది. ఆదీని పిలిచి, మందలించారు. నవజీవనంలో పైకం తీసుకొనుట నిషేధం. అందువలన టిక్కెట్లు ఖరీదు పోను,

ఎంత పైకం మిగిలినా డెహరాడూన్ చేరగానే వ్యాపారికి తిప్పి పంపమని ఆదేశించారు. అదీ అలాగే చేశాడు.

## నవజీవనంలో నూతన పథకాలు

నవజీవనం ప్రారంభించుటకు ముందు 1949 లో ఢిల్లీలో వుండే కేకీదేశాయ్ అనే తన ప్రేమికుని మెహెరాబాదు పిలిపించు కున్నారు. డెహరాడూన్‌కు సమీపంలో తన శిష్యు లొకరిపేర కొద్దిపాటి ఆస్థిని కొనమని పురమాయించారు. నవజీవన కార్య కలాపాలు నిర్వహించుటకు ఇది ముఖ్యస్థానం కావాలనికూడ నిశ్చయించారు. అందులో చిన్న ఇల్లు నిర్మించి, సమీపంలో భావికూడ తవ్వించమని కేకీని ఆదేశించారు.

బాబా బృందం యిప్పుడు డెహరాడూన్ చేరుతున్నారు. కానీ బాబా ఆదేశాలమేరకు ఆ స్థలంలో నిర్మాణాలపని యింకా పూర్తి కాలేదు. అందుచేత బృందంవారు రాగానే డెహరా డూన్‌లో మిసెస్. ఫ్రిటు బంగళాలో వుండే ఏర్పాటు చేయ బడింది. డెహరాడూన్‌కు 4, 5 కి. మీ. దూరంలో మంజరిమాష్ అనే చిన్న పల్లెటూరులో నవజీవన హెడ్‌క్వార్టరుగా, శత్రుఘ్న కుమార్ ఖిల్డియార్ అనే వ్యవసాయదారునికి సంబంధించిన స్థలంలో చిన్న ప్లాటు కొనబడింది. అది ఈరుచ్, పెండూాల పేర రిజిష్టరు చేయబడింది. అతి తక్కువ వెలపై కేకీనాలావాలా అనేవారిచేత కొనబడింది.

నవజీవనంలో కొన్ని నెలల పాటు అది బృందంవారికి వసతిగృహమైంది. బాబా ఆజ్ఞల మేరకు ఆ ఏర్పాటు చేయమని

కేకీనాలావాలాకు తెలియపరచబడింది. ఆ స్థలానికి చేరువలో నీరైతే వుందికానీ త్రాగటానికి పనికివచ్చేది కాదు. అందుకే దొడ్లోనే బాబా దగ్గరుండి నుయ్యి త్రవ్వించారు. చుట్టుప్రక్కల ఎక్కడా లేనివిధంగా గంగాభళంలాంటి నీరు పడింది. ఈ భూమి డెహరాడూన్‌లోని శతృఘ్నకుమార్‌కి చెందిన ఆస్థిలో భాగమని యింతకుముందే చెప్పుకున్నాముగదా!

ఈ విధంగా శత్రుఘ్నకుమార్, అతని కుటుంబము మొత్తం బాబా పరిధిలోకి వచ్చుట జరిగింది. కుమార్ కూతురుని బాబా కనిష్ట సోదరుడు ఆది జూనియర్ కుమారుడు దారా కిచ్చి వివాహం జరిగింది. ఇంతకుముందు కుటుంబానికి బాబాతో పరిచయమే లేదు. కుమార్ ఒక అభ్యుదయవాది. దేశ స్వాతంత్ర్య పోరాటంలో భాగం పంచుకున్న తీవ్రవాది. ఇతని గురించిన వివరాలు మునుముందు చర్చించుకుందాము.

## పులి కాస్తా మేకపిల్లయింది

డెహరాడూన్ నివాసి, బాబా సన్నిహితుడైన కేకీనాలా వాలాతో, బాబాబృందం డెహరాడూన్ రాగానే వారికి భోజనపు ఏర్పాట్లు చేయమని ముందుగానే కబురంపారు. కేకీ ఆవంట ఏర్పాటు స్వయంగా చేయమని, కుమార్‌కి పురమాయించాడు. బాబాబృందం స్టేషను చేరగానే భోజనం సిద్ధం చేయమని కుమార్‌కి మరీమరీ హెచ్చరిక చేశాడు కేకీనాలావాలా. బాబాపార్టీ

జనవరి 12, 1950 ఉదయం 10-30 గంటలకు స్టేషనుకు చేరారు. అది బాబాకు భోజనం పెట్టే సమయం. ముందుగా కేకీనాలావాలా వచ్చి బాబాను కలిసాడు.

బాబా బండినుండి దిగి దిగగానే, భోజనం గురించి, సిద్ధమైనదా? అని ప్రశ్నించారు. అందుకు కేకీ తానన్ని ఏర్పాట్లు చేశానని, భోజనం రాబోతున్నదని చెప్పాడు. డెహరాడూన్ పొలిమేరలో వున్న మంజరీమాఫ్ అనేఊళ్ళో కుమార్‌యొక్క కుటుంబం, వంట తయారుచేసి తేవాలి. కుమార్, భార్య సుభద్రితో, ఒక చక్కని బృందం యాత్రచేస్తూ వస్తున్నారని, వారికి సరిపడిన భోజనం, ఫలానా రైలువేళకు వండమని పురమాయించాడు.

అంచేత, సుభద్రి వేడి వేడి వంటకాలు అప్పటికప్పుడు చేసి పంపాలని నిశ్చయించింది. చాల్లారిపోయిన పదార్థాలు పంపారని బృందంవారు అనుకోరాదని తలచింది. వాళ్ళయిల్లు రైలుకట్టకు సమీపంలోనే వుంది. రైలు వారింటి ప్రక్కనుండే వెళతుందికనుక రైలులో ఎవరన్నా వారింటికి వస్తారని తెలిస్తే, ఆమె సాధారణంగా రైలు వారింటి సమీపానికి రాగానే బియ్యం ఎసట్లో పోసి పొయ్యిమీద పెట్టేది. అతిథులు స్టేషనులో రైలు దిగి యింటికి చేరేసరికి వేడిఅన్నం వడ్డించేది.

అయితే ఈసందర్భంలో అన్నం వండి, ఆరుమైళ్ళ దూరంలోవున్న రైల్వేస్టేషనుకు తీసుకువెళ్ళి అక్కడ వడ్డించాలని ఆమెకు ముందుగా భర్త చెప్పలేదు. అందువలన అలవాటు

ప్రకారం రైలుచూచి మొదలిడుటవలన వంట ఆలశ్యమైంది. ఒకవిధంగా యీ ఆలశ్యమే ఆ కుటుంబం మొత్తాన్ని బాబా చెంతకు చేర్చింది.

బాబా బృందానికి స్వాగతం చెప్పాలని, కుమార్ తన మోటారు సైకిలుపై వడివడిగానే స్టేషనుకు చేరాడు. వస్తూ వేడివేడి భోజనం తెచ్చాడు. అయితే అప్పటికే బృందమంతా స్టేషనులో భోజనం కొరకు ఎదురు చూస్తున్నారు. ఆహారము, యితర సరంజామాతో కుమార్ స్టేషనుకు చేరి, చెదరిన మనస్సుతో ఆలశ్యమైనందుకు క్షమించమని కోరాడు.

## ఆత్మ విశ్వాసము

బృందాన్నిగానీ, బృంద నాయకునిగానీ ఎరుగని కుమార్, క్షమించమని అందరిని అడిగాడు. ఆలశ్యమైనందుకు చింతిస్తున్నానన్నాడు. మన్నించమని వేడుకున్నాడు. బాబా స్టేషను విశ్రాంతి గదిలో నాలావాలాతో కూర్చొనివున్నారు. యీరుచ్ బాబాకు ప్లేటులో పదార్థాలన్నీ వడ్డించి బాబాముందు ఉంచబోతూ ప్రక్కనేవున్న కుమార్‌ను పరిచయం చేశాడు. అతని స్థలాన్నే నవజీవనంలో వుండుటకు వాళ్ళకిక్రింద కొన్నారని, ఈరోజు తెచ్చిన భోజనంకూడ వాళ్ళింటినుండేనని చెప్పాడు.

బాబా అదివిని సౌంజ్ఞచేస్తూ "చాలా బాగుంది. నేను చాలా ఆనందించాను. యిదంతా విని, అయితే ఆలశ్యమైనది

ఎందుకని? భోజనం లేవలసిన సమయం నీకు తెలియదా? అని అడిగారు." అందుకాతడు చెప్పాడు. "అవును నాకు సమయం గురించి చెప్పారు" అన్నాడు. అయితే కుమార్ కొన్ని నియమాలు కలిగినవ్యక్తి అగుటవలన, బాబా యిచ్చిన యీ చిన్ని హెచ్చరికతోనే బాధపడ్డాడు. ఆయన మాజీ సైనికోద్యోగి. మిలటరీ పటాలాలకు అధిపత్యం వహించిన వాడగుట వలన, ఈవిధమైన చిన్న హెచ్చరిక అతడి నెంతో బాధించింది. ఆదేశించిన సమయానికి ఆహారాన్ని చేర్చలేనందుకు పశ్చాత్తాప పడుతున్నాడు. క్షమాపణ కోరాడు. అయిన ఆలశ్యం తనది కాదని, తన భార్యదని, ఏమైనప్పటికీ, ఆ ఆలశ్యాన్ని అంతగా పట్టించుకో నవుసరంలేదని, ఏలననగా, ఆమె వేడివేడి వంటకాలు తాజాగా వడ్డించాలనే సదుద్దేశ్యంతోనే చేసిందని విన్నవించు కున్నాడు. రైలు వచ్చుట గమనించిన తర్వాతే వంట ప్రారంభించిందని అసలు కథంతా చెప్పాడు.

విషయమంతా విని, బాబా ఎంతో నొచ్చుకున్నారు. అతని భార్యగురించి మరీమరీ ఆనందపడ్డారు. కానీ అది నవజీవనమే అయినా ఆయన సర్వజ్ఞత్వం ఎలా నిరూపణైనదో చూడండి! "నీవు సహజంగా నీభార్యను వంట త్వరగా కానీమని సతాయించావు కదూ!" అన్నారు. అప్పటికింకా యీరుచ్ వడ్డించినా, ఆహారాన్ని ముట్టుకోలేదు. పళ్ళెంలో అన్నీ వడ్డించబడి ఉన్నాయి. అన్నంముద్ద కలపబోతూ, బాబా సంభాషణను సౌంజ్ఞల రూపంలో ప్రారంభించారు.

"అవునండీ! నేను కొద్దిగా సతాయించినమాట వాస్తవం. ఎంచేతనంటే, కాలమంటే ఏమిటో నాకు తెలుసును. అది ఎంతో విలువైనది. అది ఎంతో ముఖ్యమైనది. మీరు కాలానికి ప్రత్యేక శ్రద్ధ చూపుతారని శ్రీ నాలావాలా చెప్పారు. అందువలన అన్న సమయానికి స్టేషనుకు ఆహారం తెమ్మనమని నొక్కి చెప్పారు. మరి అంతా తెలిసికూడ నా శ్రీమతి, వంట తయారీ ఆలశ్యం చేసి నందుకు నేనెంతో కుపితుడనవుతున్నాను, క్షమించండి!" అన్నాడు.

## మందలింపు

"పోనీలేకానీ, నీవు నీభార్యపై అంత కోపం తెచ్చుకో వలసిందికాదు. జరిగిన కొద్ది ఆలశ్యానికి, ఆమెపై చేయి చేసు కొని వుండవలసింది కాదు. చాల తొందరపడ్డావు" అన్నారు బాబా.

ఆశ్చర్యంతో బాబావైపు తదేకంగా చూచాడు కుమార్. ఎవరీవ్యక్తి? నా కుటుంబంలో జరిగిన వ్యక్తిగత విషయాలు బట్టబయలు చేస్తున్నారు? అని మనస్సు తర్కించుకున్నాడు. "అవును. నే నామెను కొట్టాను" అన్నాడు.

"ఏమిటీ? నీ వొక ఆడదానిని కొట్టావా? అందునా నీ స్వంత భార్యను. ఒక మగవాడు ఆడదానిపై చేయి చేసు కొనుటా?" అంటూ, పరంపరగా సౌంజ్ఞలు చేస్తున్నారు. ఆ

సౌంజ్ఞలను ఈరుచ్ వ్యాఖ్యానిస్తున్నాడు. బాబా ముందున్న పళ్ళెంలో తన కత్యంత ప్రీతికరమైన పప్పు, అన్నం ఉన్నా దూరంగా తోశేశారు. సౌంజ్ఞ చేస్తూ యీ అన్నం నేను ముట్ట దలచ లేదన్నారు.

దాంతో కుమార్ మరీ కుంచించుకుపోయాడు. తన ఆవేద నంతా వెళ్ళగక్కి, నిర్దోషిత్వం నిరూపించుకొనుటకు ప్రయ త్నించాడు. "అది నాతప్పుకాదు. ఆమె నన్నావిధంగా రెచ్చ కొట్టి, కోపం తెప్పించింది. నేనామెకు రైలు వచ్చేంతవరకు ఆగవద్దని చెప్పాను. ఆరుమైళ్ళ దూరం తీసుకువెళ్ళి వడ్డించాలి కావున, ఎంత వేడిగావున్నా స్టేషనుకు చేరేసరికి చల్లారిపోతుందని చెప్పాను. పదార్థాన్ని తీసుకు వెళ్ళవలసిన దూరం గురించి తెలుసుకున్న తరువాత హడావిడిగా వంట తయారుచేసి, ఇక్క డకు చేర్చుటకు కొంత ఆలశ్యమైంది" అని సంజాయిషీ చెప్పు కున్నాడు.

బాబా అన్నం పళ్ళాన్ని ప్రక్కకు తోసి, ఆహారాన్ని తక్కిన మిత్రులకు వడ్డించమని నాలావాలాతో చెప్పారు. కుమార్ వునికినే విస్మరించారు. దాంతో కుమార్ దుఃఖితుడైనాడు. ఈ బృంద నాయకుడు తన ఆహారాన్ని తినదలచలేదని తనలో తాను గొణుక్కున్నాడు. బాబా కరుణామయుడు. "నీవు యిలాంటి పని యిక ఎప్పుడూ చేయనని మాట యిస్తావా?" అన్నారు. "ఎన్నడూ నీ భార్యను కొట్టనని మాట యివ్వగలవా?" అని ప్రశ్నించారు.

అప్పుడు కుమార్ చలించిపోయాడు. జన్మలో మరి అలాంటి పని చేయనని ప్రమాణం చేశాడు. బాబా తన చేయి ముందుకు చాచి చేతిలో చేయి వేయించుకున్నారు. ఆ తర్వాత బాబా ప్రశాంతచిత్తులైనారు. అంతకుముందు తోసివేసిన అన్నంపళ్ళెం తిరిగి ముందుకు లాక్కొని, భోజనం చేయుట ప్రారంభించారు. కుమార్ తమ తప్పేమిటో గ్రహించాడు. పులి కాస్తా బాబాయొక్క మేకపిల్లైంది.

ప్రస్తుతం కుమార్ తాపసి జీవితం గడుపుతున్నాడు కానీ ఆరోజుల్లో అతడొక విప్లవవాది. ఎవర్నీ లెక్కచేసేవాడుకాదు. చట్టాల్నీ, శాసనాల్నీ లక్ష్యపెట్టేవాడుకాడు. పరాయి పాలనను ఎదిరించిన సమరయోధుడు. యిప్పుడాతడున్నచోటు, బాబాకు అమ్మిన మంజరీమాఫ్ ఊళ్ళోని స్థలం, అంతాకూడ భారత ప్రభుత్వ సేవలో అతడు చూపిన సాహసాలకు ప్రతిఫలంగా యిచ్చిన నజరానా. ఆరోజుల్లో అతడొక అభ్యుదయకర పార్టీకి నాయకుడుగా ఉండేవాడు.

## శత్రుఘ్న కుమార్ గిల్డియాళ్

ఆవిధంగా ఆరోజు గడచింది. కుమార్ యింటికి తిరిగి వెళ్ళాడు. తర్వాత యింకేమి జరుగలేదు. కుమార్‌వద్ద కొన్న స్థలాన్ని మంజిరిమాఫ్ అనేవారు. యిప్పుడు దానినే మెహెర్ మాఫీ అంటున్నారు. బాబా అక్కడ ఉన్న కారణాన ఆయన

యెడల గౌరవ సూచకంగా ప్రభుత్వ రికార్డులలో కూడ అధికారి కంగా మెహెర్‌మాఫీగా పేరు మార్చివేశారు.

పోతే యిప్పుడు శతృఘ్నకుమార్ గిల్డియాల్ గురించి తెలుసుకుందాం. బాబాకు చేరువై నందున అతడు ఆర్థికంగా కాక, ఆధ్యాత్మికంగా అధికలాభం పొందాడు. నిజానికి బాబా మంజరీ మాఫ్‌ని ఎన్నుకున్నది, ముఖ్యంగా కుమార్, అతని కుటుంబ సభ్యులకొరకేనని చెప్పుకుతీరాలి. బాబా బృందం అక్కడున్నన్ని రోజులూ, కుమార్, అతనిభార్య సుభద్ర, వారి పిల్లలు మండ లితో ఎంతో సన్నిహితులైనారు. పిల్లలు రోజూవచ్చి, ఆడుకొనే వారు. కుమార్‌కూడ తరచుగావచ్చి, మండలివారికి కావలసిన సదుపాయాలగురించి విచారిస్తూ వుండేవాడు. బాబాకూడ అతని కేదోపని వప్పగిస్తూ ఉండేవారు.

మంజరీమాఫీలో అంచలంచలుగా కొన్ని నెలలపాటు ఉండుట జరిగింది. ఆతరువాత, బాబా హరిద్వారం వెళ్ళారు. అక్కడనుండి మోతీచూరు వెళ్ళి అక్కడ కొన్నాళ్ళు వున్నారు. ఋషీకేష్ మొదలగు అనేక ప్రదేశాలు పర్యాటించారు. అంచ లంచలుగా జరిగిన యీ వేర్వేరు మజిలీ లన్నిటిలోనూ కుమార్ సకల సదుపాయాలు చూచేవాడు.

బహుశః మంజరీమాఫీ వదలిన ఒక సంవత్సరం తరువాత అనగా నవజీవనం గడిపిన తర్వాతా బాబా అమెరికా వెళ్ళి వచ్చారు. ఒకరోజున సతారాలో ఉండగా జరిగిన సంఘటన గురించి తెలుసుకుందాం. ఆ సమయంలో బాబాకు సన్నిహితు

లైనవారిని, నవజీవనంలో సహజీవనం గడిపినవారిని సతారా పిలిపించుకున్నారు. అంతా వేర్వేరు బంగళాలలో విడిది చేశారు.

వివిధ బంగళాలలో విడిదిచేసిన తన ప్రేమికులను కలుసుకునేందుకు బాబా వెళుతుంటే, కుమార్ గొడుగు పట్టేవాడు. అలా గొడుగు పట్టి, ప్రక్కనే నడుస్తుండగా, ఉన్నట్లుండి హఠాత్తుగా రోడ్డుమీద ఆగి, శత్రుఘ్నకుమార్‌తో తన వాగ్దానం గుర్తుందా? అని అడిగారు. అతనికి వెంటనే ఆ వాగ్దానమేమిటో స్ఫురణకు రాలేదు. ఏమి వాగ్దానము చెప్పుమా? అని ఆలోచిస్తుండగా బాబా అతనివైపు తీక్షణంగా చూచారు. ఆ చూపులతో అతనికి గత స్మృతులు జ్ఞాపకాని కొచ్చాయి.

"అవును బాబా! నా వాగ్దానం గుర్తొచ్చింది." అన్నాడు. "అయితే నీభార్యపై, మళ్ళీ ఎప్పుడైనా చేయి చేసుకున్నావా?" అని ప్రశ్నించారు. "లేదు బాబా! లేదు. మరెన్నడూ ఆమెను కొట్టలేదు" అన్నాడు. అది విని బాబా చాలా సంతోషించారు. బాబా ఒక అడుగువేసి మళ్ళీ సౌంజ్ఞ చేశారు. "మరి నేనుకూడ నా వాగ్దానాన్ని నిలుపుకున్నాను" అన్నారు. ఆ చిన్న సంకేతంతో అతనికి కనువిప్పు అయింది. జైలునుండి విడుదలైన తర్వాత, ప్రథమంగా ఇప్పుడే బాబా అంటే ఎవరో కుమారుకు అర్థమైంది.

మొదట్లో అతడు ఎవరినీ లెక్కచేసేవాడుకాదు. అతడొక బాదరబందీ లేని వ్యక్తి. రాజకీయ ఖైదీగా, బహు తరచుగా జైలుశిక్ష అనుభవించేవాడు. ఆరోజుల్లోనే అతడు సుభద్రిసు

వివాహమాడాడు. వివాహమైన వెంటనే అతడు తిరిగి జైలుకు తీసుకువెళ్ళబడ్డాడు. అందువలన అతడు తనభార్య ఏమైందో తెలుసుకోలేకపోయాడు.

వివాహానంతరం అతని భావాలు మారాయి. చివరకు, యిన్ని సంవత్సరాలు రాజకీయ కార్యకర్తగా గడిపిన జీవితం, రాజకీయ నాయకత్వం, యివన్నీ ఏమీ లాభదాయకం కావని భావించాడు. అవేమీ విలువలేనివని, మానవసేవా కార్యక్రమాలెన్ని చేపట్టినా నిరుపయోగ మవుతున్నాయని తలపోశాడు. ఆ ఆలోచనతో తనే, ఏదో తప్పు చేశానన్న భావం చోటుచేసుకుంది.

తన యవ్వన దశలో తాను నాస్తికుడనని స్వయంగా చెప్పేవాడు, ఆ తర్వాత ఆస్తికుడయ్యాడు. నిజానికి అతడెవరైనప్పటికీ, వివాహానంతరం ఎక్కువ కాలం జైలు జీవితం గడిపేసరికి విసుగుచెంది, భగవంతునిపై విశ్వాసం లేనప్పటికీ, ఓ రోజున జైలులోవున్న తనకి ఓ ఆలోచన వచ్చింది. భగవంతుని ఉద్దేశించి, యిలా ఉచ్చరించాడు.

"ఏమయ్యా? మిష్టరు దేముడూ! ఇటుచూడు! నీవు నిజంగా దేముడవైతే, అసలు దేముడంటూ ఉంటే, నే నీ జైలు కటకటాల వెనుక విసుగుచెంది వున్నాను. అందువలన, నేను రేపు ఉదయానికల్లా బయటపడదలచాను. కనుక అలా రేపు తెల్లవారేసరికి నీ వలా చేయకలిగి, నేను విడుదలైతే నీపై నమ్మకం పెంచుకొని, యీ జైలు నుండి బయటపడిన తర్వాత

నా ఆజన్మాంతం నీసేవా కార్యక్రమంలో నిమగ్నమవుతాను" అని ప్రార్థన రూపంలో ప్రతిజ్ఞ చేశాడు.

యీ ప్రపంచంలో అత్యధికులు భగవంతు డున్నాడని విశ్వసించేవారే. ముఖ్యంగా కష్టాల్లో వున్నప్పుడు భగవంతుడు తప్పక గుర్తొస్తాడు. అలాగే, కుమార్ కూడ, తనకుతానే నచ్చ చెప్పుకొని, భగవంతు డుండితీరాలని నిశ్చయించాడు. భగవంతు డుంటే, తప్పక ఏదో అద్భుతం చేసి తీరతాడనే నమ్మకం పెరిగింది. ఆశించిన కాలంలో, తన విడుదల జరిగితే, జైలుగోడల బయటపడిన తర్వాత, ఎలాంటి బాధలనైనా సంతోషంగా స్వీకరించి, దైవ కార్యాన్ని చేపట్టాలని నిశ్చయుడైనాడు.

మరి భగవంతు డున్నాడు. అందుకే కుమార్ తెల్లవారక ముందే, తన విడుదల ఉత్తర్వులు అందుకున్నాడు. న్యాయానికి, ఏ ఖైదీ అయినా తన విడుదల గురించి మూడు రోజులు ముందుగా మాత్రమే తెలుసుకోగలడు. అట్టిది, యిప్పుడు కుమార్ విడుదల ముందుగానే తన ప్రార్థన ప్రకారం జరిగిపోతూంది. ఒకరను వచ్చి, జైలు గదితలుపులు తెరచి, బయటకు రమ్మనమని పిలిచి, బయటగేటుకూడ తెరచి, జైలునుంచి, యింటికి వెళ్ళవచ్చని చెప్పాడు.

ఇదంతాచూచి కుమార్ ఆశ్చర్యపోయాడు. "ఏమిటి సంగతి? ఎందుకు నన్ను యింటికి వెళ్ళమంటున్నావు?" అని అడిగాడు. "యివిగోనయ్యా! ఉత్తరువులు. నిన్ను తెల్లవారక మునుపే విడుదల చేయమని ఆజ్ఞలు యిచ్చియున్నారు"

అని ఉత్తరువును చూపాడు సిపాయి. కుమార్ మతి పోయింది. విస్మయంతో, ఒక రాజకీయ ఖైదీకి అలా ఎన్నడూ జరుగలేదు, అనుకున్నాడు. ఏమైతేనేమి తన ప్రార్థన ఫలితంగా, మర్నాటి ఉదయానికల్లా అతడు విడుదల చేయబడ్డాడు.

అప్పుడతని సంతోషాని కవధులు లేవు. ఆనందాతిరేకంతో తన వస్తువులన్నీ సర్దుకొని, మిగతా ఖైదీలు లేవకముందే జైలు వదలి బయటకు వచ్చాడు. ఆతర్వాత దాదాపు 30 సంవత్సరాలు గడిచిపోయాయి. ఆకాలంలో నాడు జైలులో జరిగిన యీ వుందంతం పూర్తిగా మరచిపోయాడు. యీ ఉదంతాన్నే బాబా సతారాలో కుమార్‌కి గుర్తుకు వచ్చేటట్లు చేశారు.

ఎన్నో ఏళ్ళకిత్రితం జైలునుండి భగవంతుని ప్రార్థించి, విడుదలైనా, యిన్నాళ్ళకు మొదటిసారిగా, తానానాడు భగవంతుని ప్రార్థించిన విషయం జ్ఞాపకం తెచ్చుకున్నాడు. బాబా అతనివంక తీక్షణంగా చూచి, తనచేయి కుమార్ చేతిలో వేసి, "నీవానాడు ప్రార్థించిన మిష్టరు దేముడ్ని నేనే! నేను నా వాగ్దానాన్ని పూర్తి చేశాను" అన్నారు. ఆ చిన్ని సంకేతంద్వారా "నేను కూడ నా వాగ్దానాన్ని నిలుపుకున్నాను" అని చెప్పి తన సర్వజ్ఞత్వాన్ని ఎరిగించారు.

కుమార్ యింకా మెహర్‌మాఫీలో సజీవుడై వున్నాడు. అక్కడ అతనికో ఇల్లుంది. భిక్షుక జీవితం కడు వుల్లాసంతో గడుపుతున్నాడు. చంచల స్వభావంతో కాక, సరదాగా ఇంటిం

టికీ తిరిగి, బాబా కథలు చెబుతూ, ఇతరులను బాబా ప్రేమలో ముంచి, ఆనందపరుస్తూ కాలం గడుపుతున్నాడు. అతడు బాబాకు రాసే ఉత్తరాల్లో "ప్రియమైన ఖుదా!" అని సంబోధించేవాడు. చూచారా అనాడు డెహరాడూన్‌లో కుమార్‌నుండి తీసుకున్న చిన్న ప్రతిపలో ఎంత గ్రంథం ఉన్నదోకదా! అవతారుని ప్రతి చర్యలోను ఎంతో సత్యం నిగూఢమై ఉంటుంది. నిజానికి ఆయన లీలను ఎవరూ కొలువలేరు.

## దైవాదేశము

ఆలశ్యంగా భోజనం తెచ్చిన కుమార్ బాబాచే మందలించ బడటం, అతనిలో పశ్చాత్తాపం కలగటం అదంతా లీలగా గడిచి పోయింది. బాబా భోజనం చేసిన తర్వాత కుమార్ ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. బాబా బృందమంతా ఇంకా డెహరాడూన్ రైల్వేస్టేషనులోనే వున్నారు. కేకీనాలావాలా బాబా ప్రక్కనే కూర్చున్నాడు. యింకా ఏమైనా వినతగిన వార్తలుంటే చెప్ప మని నాలావాలాని ప్రశ్నించారు,

"అందుకే నేనింతవరకు ఎదురు చూస్తున్నాను. మీకో ముఖ్య విషయం చెప్పాలనే కూర్చున్నాను. భోజనం గురించి, అలజడి జరుగుతుందని ముందే అనుమానించాను. మీరు రాగానే మీకు కొంత చెప్పాలనుకున్నాను. కానీ, భోజనం గొడవలో వీలుపడలేదు. బయట ఒకతను మీకొరకు నిరీక్షిస్తున్నాడు" అని మొదలెట్టాడు. "ఏమిటి కథ? ఎవరతను? ఎందు కొరకు నిరీక్షిస్తున్నాడు?" అని ప్రశ్నించారు.

అప్పుడు నాలావాలా చెప్పాడు. "బాబా! ఆయన, నన్ను గత మూడురోజులుగా, రాత్రి పగలు చాల వత్తిడి చేస్తున్నాడు. మూడురోజులక్రితం అర్ధరాత్రి మాయింటికి వచ్చి తలుపు తట్టాడు. పడుకున్న నేను లేచివెళ్ళి తలుపు తీశాను. ఆగంతకుడు అపరిచితుడు. ఎవరు కావాలని అడిగాను. ఇక్కడకు ఎవరో బృందంవారు వస్తున్నారట. వార్ని ఎరిగినవారిల్లు యిదేనా అని అడిగాడు. అయితే మీరు వస్తున్న రహస్యాన్ని ఎవరికీ వెల్లడి చేయవద్దని కఠినంగా ఆదేశించి నందున, ఎవరా బృందం? ఎక్కడినుండి వస్తున్నారు? నీవనే దేమిటి? అని ఏమీ ఎరుగనట్లు ప్రశ్నించాను."

## దైవ ప్రేరణ

అంత ఆ అపరిచితుడిలా అన్నాడు "దక్షిణాపథం నుండి ఒకరు కొంతమంది బృందాన్ని వెంటపెట్టుకొని, నాయకత్వం వహిస్తూ యీవూరు రాబోతున్నారట. నాలుగురోజుల క్రితం నాకో కల వచ్చింది. అది ఎంతో అసాధారణమైంది. నేనా కలలో ఒక బృందాన్ని వెంటపెట్టుకొని, దారివెంట యాచకవృత్తి చేస్తూ వస్తున్న ఒక అద్వితీయ వ్యక్తిని చూచాను. ఆయనే ఆ బృందానికి నాయకుడు. వారు చాలా గొప్పవారుగా కనిపించారు. చాల స్పష్టంగా నేను చూచాను. కలలో ఆ బృందం నాయకుడు, వారందరికీ కావలసిన ఆహార పదార్థాలు తీసుకువచ్చి, వారికి తినిపించమని ఆజ్ఞాపించారు. ఆయన తెల్లని సర్దా వేసుకున్నారు.

భుజములపై జాలువారే జుట్టుతో, ధగధగ మెరుస్తున్న మూర్తిని చూచి, వారి పాదాలకు వంగి నమస్కరించాను. అంత నన్నాయన లేపి, వీపు తట్టి "యిప్పుడు నేను డెహరాడూన్‌లో వున్నాను, అక్కడకు రా. నా సేవ చేసుకో, నన్ను తినిపించు" అన్నారు. అందుకే వెతుక్కుంటూ ఉదయాన్నించి ప్రయత్నించి, చివరికి, యీ యిల్లేనని నిర్ధారణకు వచ్చాను" అన్నాడు.

"ఏమోబాబూ! నాకదేం తెలియదు. అదంతా నీ ఊహ అయివుంటుంది. ఆ బృందం ఎవరో! ఎక్కడవుంటారో? నాకు తెలియదు" అన్నాడు నాలావాలా.

"లేదండి! నేను అన్ని యిళ్ళూ అడుగుతూవచ్చాను. అందుచేతనే ఇంత ఆలశ్యమైంది. అసలు కావాల్సిన యిల్లు తెలుసుకోవాలని ప్రయత్నించాను. మరి నేను నా కలలో చూచిన యిల్లు యిదే! కనుక దయచేసి చెప్పండి! యిక్కడికి రాబోయే బృందం గురించి ఎరిగినవారు మీరేనా? దయచేసి చెప్పండి" అని బ్రతిమలాడాడు.

"దానిగురించి నాకేమీ తెలియదు. మీ రేదో పొరపడ్డారు. దయచేసి మీరు మరెక్కడికైనా వెళ్ళి, వేరెవరినైనా అడిగి తెలుసుకోండి!" అని బుకాయించాడు నాలావాలా. బాబా చిరునామాను ఎవరికీ బహిర్గత పరచవద్దని నాలావాలా ఆదేశింపబడి యున్నాడు. అందువలన, అపరిచితునికి అసలు విషయం చెప్పదలుచుకోలేదు.

కానీ ఆగంతకుడుమాత్రం కదలలేదు. అక్కడే ఉండి పోయాడు. నాలావాలాకు ఏమి చేయాలో తోచలేదు. అప్పటికి అసలే అర్ధరాత్రి దాటింది. ఏమి చెప్పాలో బోధపడలేదు. ఆ రోజు చాలా అలసి ఉండుటవలన, అతడినెలాగైనా వదిలించు కోవాలనుకన్నాడు. 'దయచేసి మీరు వెళ్ళిపోండి. రేపు ఉదయం వస్తే ఆలోచిద్దాం' అన్నాడు.

# నైవేద్యం

"సరే! ఎక్కడికి వెళ్ళమంటారు? నేను తెచ్చిన సరుకులు చూడండి! అవన్నీ ఎక్కడ పెట్టాలి?" అని వాదించాడు. నాలావాలా కిటికీగుండా బయటవున్న బళ్ళ వరస చూచి ఆశ్చర్య పోయాడు. ఒక బండినిండా స్వచ్ఛమైన తాజా వెన్నతో నిండిన క్యానులున్నాయి. అవన్నీ మిలటరీ క్యానులు. మూతలన్నీ సీలు వేయబడి ఉన్నాయి. ఆ క్యాన్లలోని వెన్న చెడకుండా మంచుగడ్డలమధ్య ఉంపబడినాయి. మరో బండినిండా, ఎండు ఫలాలు, ఆల్మండు, పిస్తా, జీడిపప్పు, ఎండిన అత్తిపళ్ళు వగైరాలు ఉన్నాయి. మరో బండినిండా డబ్బాలతో నూనెలు, మిర్చి, మసాళా వగైరాలున్నాయి. యింకొక బండిలో బియ్యం, పప్పులు, ఉప్పు, తాజా నెయ్యి యింకా ఏవేవో ఉన్నాయి. మరో బండిలో బంగాళ దుంపలు, ఉల్లి, వెల్లుల్లి, తాజా కూరలున్నాయి.

నాలావాలా వంట కవుసరమైన ఆ పదార్థాలతోవున్న బళ్ళ వరుసను చూచాడు. అమితాశ్చర్యపడ్డాడు. ఏమి చేయాలా?

అని వ్యాకులపడ్డాడు. తనను తాను దోషిగా తిట్టుకున్నాడు. విషయం తెలిసీ బహిర్గత పరచలేని అసమర్ధునిగా బాధపడ్డాడు. బాబా, ఆయన బృందం వస్తున్నారని అతడెరుగును. అయినా, ఆ రహాశ్యం బయటపెట్టరాదన్న ఆంక్ష వుండుటచేత, తానేమీ ఎరుగనని చెప్పి నమ్మిస్తున్నాడు.

ఆగంతకుడుకూడ వదలక యీ విషయంలో యదార్థాన్ని రాబట్టాలని వత్తిడి చేస్తున్నాడు. బాబాను కలలో చూడకలిగిన ధన్యుడాతడని ఎరిగిన నాలావాలా అతనిని, నిర్మొహమాటంగా తిరస్కరించి పంపివేయలేక పోయాడు. బాబా కృపవలన అతనిలో అంతర్గత ప్రేరణ కలిగిందని గ్రహించాడు. అందుకే అంత సరకు తెచ్చాడని అనుకున్నాడు.

## వివాళులు

నాలావాలా, ఆ వచ్చినతను ఎవరో ఎరుగడు. జరిగిన సంఘటనలో, హరజీవన్‌లాల్ తన కుమారుని మొరాదాబాదు పంపి, బళ్ళకొలది ఉన్ని బట్టలు, ఎండిపళ్ళు పంపాడంటే, అతడు బాబా ప్రేమికుడు. ఇతడో? కేవలం కలలో కన్పించి, ఇచ్చిన ఒక అపరిచిత మూర్తియొక్క ఆదేశాల్ని పాటించి, తెలియని చోటికి వేళకానివేళ వచ్చి, అపరిచితులను కలసి, సంగతి సందర్భాలు విచారిస్తున్నాడు.

ఆ వ్యక్తిని ఏంచేయాలో కేకీకి అర్థంకాలేదు. ఏమైతేనేమి? ఆ వ్యక్తిని వదిలించుకోవాలని, "పొద్దుటే వస్తే మాట్లాడుకో

వచ్చాను. దయచేసి వెళ్ళిపోండని" చెప్పాడు. "ఈ అర్ధరాత్రి బళ్ళకొలదీ ఉన్న యీ సరకులన్నీ ఎక్కడకు తీసుకువెళ్ళను?" అని అడిగాడు.

"మీ యిష్టంవచ్చినట్టు చేసుకోండి. అదంతా నాకేం తెలియదు. ఫలానాచోట ఓ సత్రం వుంది. అక్కడైతే ఏమీ ఫరవాలేదు. అక్కడకు తీసుకువెళ్ళండి" అని సలహాయిచ్చాడు. ఎంతో అయిష్టంతోనే, ఆగంతకుడు నాలావాలా ప్రాంగణం వదలి వెళుతూ, మళ్ళీ పొద్దుటే తప్పక వస్తాను—దీనికి సంబంధించిన సత్యాన్ని చెప్పితీరాలని హెచ్చరిస్తూ వెళ్ళిపోయాడు.

మర్నాటి ఉదయం ఆతను మళ్ళీ వచ్చాడు. అతనివాలకం చూచి నాలావాలా నిజాన్ని దాచలేకపోయాడు. హృదయానికి, మనస్సుకు మధ్య సంక్షోభం ప్రజ్వరిల్లింది. యదార్థాన్ని దాయుటకు హృదయం ఒప్పుకోలేదు. అతనిని తిరస్కరించలేకపోయాడు. నిజాన్నంతా అతని కెరుకపరచాడు.

## తోడిసింగు

ఢిల్లీకి దక్షిణంగా దగ్గర్లోనే ఉన్న పెద్దపట్టణం అలీఘర్. బ్రిటిష్‌వారి పరిపాలన రోజుల్లో వెన్న తయారుచేసే పట్టణాల్లో అలీఘర్ ఒక ముఖ్య కేంద్రంగా వుండేది. అలీఘర్ యూనివర్సిటీ ప్రసిద్ధిచెందిన విశ్వవిద్యాలయం. మరి క్యావెంటరు వెన్న, పెరుగు అంటే ఆరోజుల్లో స్వచ్ఛమైనవని మంచిపేరు

కలిగివుండేది. కలలోనే బృందాన్ని చూచి, వెతుక్కుంటూ వచ్చిన ఈ ఆగంతకుని పేరు తోడీసింగు. అతడు క్యాంటెంటరు కంపెనీవారికి టోకుగా పాలకీస్తంసు సరఫరా చేసేవాడు.

కలలో చూచిన మూర్తిని తన గురువుగా నిర్ణయించు కున్నాడు. మెహెర్‌బాబా పేరు అతనెన్నడూ వినియుండలేదు. అయినా అప్రయత్నంగానే, నాలావాలా ఏమడిగినా "అంతా బాబాకు తెలుసును" అనేవాడు. ఏమడిగినా, అ రెండుమాటలే వుచ్చరించేవాడు.

కలలో చూచిన మూర్తి సశరీరంతో రాబోతున్నట్లు, తాను స్వయంగా చూడబోతున్నట్లు తెలుసుకున్న తోడీసింగు ఆనందం అవధులు దాటింది. తాను తెచ్చిన సరుకులన్నీ ఆ సత్రంలో వుంచి, బాబా దర్శనం కొరకు ఎదురు చూస్తున్నాడు. కూర గాయలు సహజంగా నిలవవుంటే చెడిపోతాయి కనుక, రోజూ చెడిపోయినవి ఏరేసి, తాజా సరకు ఎప్పటికప్పుడు తెప్పిస్తున్నాడు.

యీవిషయాలన్నీ బాబాకు చెప్పి "బాబా! నీ ఆజ్ఞ జవ దాటి, నీ వునికిని బహిర్గతపరచినందుకు క్షమించ"ని ప్రార్థించ వలసి పడ్డాడు నాలావాలా. "నేనాతనిని తిరస్కరించలేక పోయాను. యదార్థాన్ని దాచుటకు నాహృదయం ఒప్పుకోలేదు" అని విన్న వించు కున్నాడు. "నీవు మంచిపని చేశావు. నిజాన్ని బయట పెట్టుట మంచిదైంది" అని నాలావాలాను మృదువుగా స్పృశిస్తూ, అతడు తెచ్చిన సరుకులు స్వీకరించుటేకాక, తనతో సమాగమ మగుటకు తోడీసింగును తీసుకురమ్మనమని కేకీని పంపారు.

బాబా ఆజ్ఞానుసారం తోడీసింగు, వచ్చీరాగానే, బాబా పాదాలపై సాష్టాంగపడ్డాడు. ఆనాడు కలలో కనపడి, యీసరుకులన్నీ యిక్కడకు తీసుకురమ్మనమని ఆజ్ఞాపించినమూర్తి యీాయనే అని వెంటనే గుర్తించాడు. "ఒహీతోహై, ఒహీ తోహై!" ("ఆయనే యీాయన—ఆయనే యీాయన") అని తనలోతాను గొణుక్కున్నాడు. తానూహించినవ్యక్తి చాల చాల గొప్పవాడు అని తలపోశాడు.

ముకుళితహస్తుడై, నిజమైన హృదయారాటంతో తాను తెచ్చిన ఆ బళ్ళకొలది వున్న సరకులన్నీ స్వీకరించమని ప్రాధేయపడ్డాడు. తాను వాటన్నిటినీ ఆయన ఆజ్ఞానుసారమే తెచ్చానని విన్నవించుకున్నాడు. తిరస్కరించివద్దని బ్రతిమాలాడుతున్నాడు. లేకపోతే అదంతా తన దురదృష్టమని, బాధపడతానన్నాడు.

ప్రేమతో మొరపెట్టుకున్న అతని పలుకులు విని బాబా ముగ్ధులైనారు. తాను తెచ్చిన వస్తురూప బహుమానాలన్నీ స్వీకరిస్తాను కానీ ఒక షరతుమీద వప్పుకుంటానన్నారు. షుమారు ఒక నెలరోజులుపాటు, అతని కుటుంబంవారు ఆప్రదేశానికి వచ్చి బాబా బృందంతో వుండి, వారందరికీ వంట చేసిపెడితే, తాను తెచ్చిన సరుకులు స్వీకరిస్తానన్నారు.

అది విని తోడీసింగు అతిసంతోషం చెందాడు. ఇది తనకు బ్రహ్మాండమైన వరమంటూ ఆనందంతో చిందులు త్రొక్కి, నృత్యం చేశాడు. నిజానికిదంతా బాబా ఎవరో తెలియకుండానే జరిగిపోయింది. అతడు బాబా ఎవరో ఎరుగడు. ఆయన

యుగావతారుడని అతనికెవరూ చెప్పలేదు. మరిప్పుడు సామాన్య హితుడుగా, మిత్రులమధ్య మిత్రుడుగా వచ్చారనికూడ ఎరుగడు. ఏమీ తెలియకనే, ఆయన భగవంతుడని ఎరుగకనే, ఆయన రూపంమీద భక్తి విశ్వాసా లుంచాడు.

తన కుటుంబాన్ని తీసుకురావాలన్న ఉత్సాహంతో, తోడీ సింగు బాబావద్ద శలవు తీసుకొని అలీఘర్ వెళ్ళిపోయాడు. మంజరీమాఫీలో బాబా బృందాని కేర్పరచిన గమ్యానికి బాబా బృందం వెళ్ళిపోయింది. కొద్దిరోజుల్లోనే తోడీసింగు, తన తల్లి, భార్య, సోదరి, కుమార్తె, పెంచుకున్న సోదరి కుమారుడు వీళ్ళందరితో మంజరీమాఫీ చేరుకున్నాడు.

వాళ్ళు వస్తూ, మళ్ళీ బ్రహ్మాండమైన బరువు లేసుకొని వచ్చారు. బరువంటే ఏమనుకున్నారు? మూతలు కట్టిన సంచులనిండా వంట పాత్రలు, వంట సామానులు బృందమంత టికీ వండిపెట్టేందుకై తీసుకొచ్చారు. వంటలో వాడే మిర్చి, మసాలా దినుసులు కూడ తెచ్చారు. నిజానికి, అవి యివి అని కాక, వారికవుసరమయ్యే సమస్తం తెచ్చారు. వారు మార్చు కొనేందు కవుసరమయ్యే జత బట్టలుమాత్రం చేతిసంచిలో పెట్టు కొని తెచ్చుకున్నారు.

మంజరీమాఫీ చేరగానే, అక్కడ వారందరినీ చూచి, అక్కడ వుండుటకు ఎంతో సంబరపడిపోయారు. వచ్చీరాగానే, సంచులూడదీసి, వంట ప్రారంభిస్తామన్నారు. "లేదు. ఈ రోజుకు వద్దు. రేపటినుండి వంట ప్రారంభింతురుగాని" అని బాబా వారించారు.

## మెహెర్ షాఫీ

అయితే వారందరికీ ఎక్కడ ప్రపంచాలో మిత్రులకు అంతు చిక్కలేదు. వీళ్ళను ఎక్కడుంచాలని బాబాయే మిత్రులనడిగారు. వారున్న యిల్లు చాల పురాతన పద్ధతిలో కట్టబడినయిల్లు. అయినా చాల గట్టిది. గోడలమీద పైన ఎక్కడో ఎత్తుగా చిన్న కిటికీ లున్నాయి. అందుచేత గదులన్నీ చీకటిగా వుండేవి. అందులో స్త్రీలుమాత్రం బాబాతో ఉండేవారు.

మిత్రులేమో కొందరు ఆరుబయట వుండేవారు. మరి కొందరు బయట షెడ్డులో వుండేవారు. ఇంకొందరిని ప్రక్కనున్న గదులలో వుండుటకు అనుమతించారు. అది చాలా పెద్ద స్థలం. అందులో సమతలంగావున్న డాబా పైభాగం ఒకటున్నది. దానిమీద నిలబడితే అతి సుందర స్వర్గ దృశ్యాలు ఊహించుకుంటూ తిలకించవచ్చును. మంచుతో కప్పబడిన హిమాలయ పర్వత సానువుల సుందర దృశ్యం చూడముచ్చటగా వుండేది.

## సౌశీల్యం-సౌభాగ్యం

మర్నాడు, తోడీసింగు కుటుంబానికి మిత్రులు వంటగది చూపారు. అది చూచి వారెంతో ముచ్చటపడ్డారు. వారే అసలు వంటగది చూపమని అడిగారు. "పడకగదికాదు మాకు ముఖ్యం వంటగదే" అన్నారు. అది విశాలమైన వంటగది. ఒకప్రక్కన పొయ్యి, నీళ్ళ కుళాయి, మురుగు పోయే మార్గం, అన్నీ

వున్నాయి. "ఇది ఎంతో అద్భుతంగా వుంది. మే మిందు లోనే ఉంటాం" అన్నాడు తోడీసింగు.

వాళ్ళు తెచ్చుకున్న చిన్న బెడ్డింగులు విప్పారు. ఆ వంట గదిలోనే ఒక ప్రక్కన వున్నారు. వారి స్నానాలు వగైరాకూడ అందులోనే చేసేవారు. వారా గదిలోనే వుంటూ, వంటా వార్పూ చూచుకుంటూ వుండేవారు. సాయం సమయాల్లో మాత్రం, బయ టకు వచ్చి, కాసేపు మిత్రులతో గడిపేవారు. వారు కేవలం వంట చేయుటకే పిలిపించబడినారు కనుక, తమ విద్యుక్తధర్మాన్ని నూటికి నూరుపాళ్ళు నిర్వర్తించేవారు.

ప్రతిరోజు ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం వారు తయారుచేసే వంటకాలు, రాజ కుటుంబానికి చేసే భోజనంలాగ ఉండేవి. వడ్డించిన పదార్థాలను పారవేయక, సుష్టుగా భోంచేసే వారు మిత్రులు. ప్రతిపూట భోజనానంతరం ఆయాసపడిపోయే వారు. ఆలమందు పళ్ళు, పిస్తా, వెన్న, నెయ్యి, వగైరాలన్నీ తిని, తేలికగా జీర్ణం చేసుకోలేక పోయేవారు. రుచిగా ఉన్నా యని అమితంగా తిని, ఆయాసపడిపోయేవారు.

ఉదయం వేళల్లో తోడీసింగ్ మార్కెట్టుకు వెళ్ళేవాడు. వెళ్ళేప్పుడు టాంగాలో పోయి, వచ్చేప్పుడు దాని నిండా కూరలు కొని తెచ్చేవాడు. డెహరాడూన్ సమీపంలో కూరగాయలు విరివిగా పండిస్తారు. అక్కడ దొరికే పచ్చి బఠాణీలు చిన్న సైజు గోళీకాయలంత వుంటాయి. కాలీఫ్లవరు పెద్ద బంతుల

వలె వుండేవి. నవనవలాడే కూరలు కొని వంటింటికి చేర్చే వాడు. అప్పటివరకు మిత్రులంతా భిక్షాటన చేసి, ఆహార నియమం పాటించారు. కాలే కడుపులకే పచ్చపచ్చ కూరగాయలు కనువిందు కలిగించి నోరూరించేవి. అప్పటికప్పుడు విచ్చు కుంటున్న పూలెన్నో తెచ్చేవాడు.

ఒక రోజున బాబా స్త్రీల గదిలోకి వచ్చారు. ఆయన చేతిలో ఏదోవుంది. "ఏమిటిది బాబా? యిది పళ్ళెమా?" అని మెహెరా అడిగింది. ఓ పళ్ళెంలో నీరుపోసి వుంచగా గడ్డ కట్టింది. ఆ గడ్డను బయటకు వంచగా అది పళ్ళెం ఆకారంలో గడ్డకట్టి వూడివచ్చింది. పళ్ళెంలానే కనపడుతోంది. ఆ సమయంలో చాల చలిగా వుంది. అయినప్పటికీ తోడీసింగు కుటుంబం ఉదయాన్నే చీకటితో లేచేవారు. బాబా కూడ పెందల కడనే లేచేవారు.

వారు ఉదయం నాలుగు గంటలకే లేచి స్నానం చేసి, వంట మొదలుపెట్టేవారు. తెల్లారేసరికి ఉప్మా, రవ్వ కేసరి చేసి పెట్టే వారు. మధ్యాహ్నానికి రకరకాల కాయకూరలతో వంటకాలు చేసేవారు. రాత్రికి మరికొన్ని రకాలు. ఇలా చేసిన రకం చేయ కుండా అన్నీ శాకాహారాలే తయారు చేసేవారు. నవజీవనంలో శాకాహారమే తినాలన్న నిబంధన లేకపోయినా భిక్షుక వృత్తిలో శాకాహారానికే మిత్రులంతా అలవాటు పడ్డారు.

# బాబా జనాయే

తోడీసింగు కృష్ణ భక్తుడు. అతని కుటుంబంవారికి కృష్ణుడు కులదైవం. వారు బాబాలో కృష్ణ ప్రభువును దర్శించు కున్నారు. కృష్ణుడు తన గోపికలు, గోపాలకులతో తిరిగి తమ దేశం వచ్చారని భావించారు. రోజులు చాలా సరదాగా గడు స్తున్నాయి.

మిత్రులుకూడ, ఏపనీ లేక విశ్రాంతిగా హాయిగా వున్నారు. మంచి భోజనాన్ని తింటున్నారు. అలా తన మిత్రులు సరదాగా కాలం గడుతున్నా రనుకున్నారో ఏమో, బాబా ఒక నిర్ణయానికి వచ్చారు. తోడీసింగు కుటుంబాన్ని ముందుగా ఒక నెల వుండి వండిపెట్టమని ఆదేశించారు. అయితే నెలకు బదులుగా ఒక వారం గడవగానే బాబా తన నిర్ణయం మార్చుకున్నారు.

"మీరు యిప్పటివరకూ చేసింది చాలు. మీరు చేసిన సేవకు నేను ఎంతగానో సంతోషించాను. మీ ప్రేమ నాలో హత్తుకుపోయి, నన్ను ముగ్ధుణ్ణి చేసింది. మరి యిప్పుడు మీ రంతా యింటికి వెళ్ళిపోవాలి" అని తోడీసింగును పిలిచి చెప్పారు.

పాపం ఆ వార్త విని తోడీసింగు నిశ్చేష్టుడైనాడు. అంత త్వరలోనే వెళ్ళిపోవాల్సి వస్తుందని వూహించలేదు. కానీ అది తన గురువాజ్ఞ. అందువలన అయిష్టంగానే వారు అలీఘర్ వెళ్ళి పోయారు. పోతూ పోతూ వారు వదిలి వెళ్ళిన ఆహార పదార్థా లతో వంట గదిలో వంటచేసేపని మిత్రులవంతైంది. వారూ

పెందలకడనే లేచేవారు. బాబాకు 9-30 కల్లా భోజనం తయారు చేసిపెట్టేవారు

ఇంతకుముందే చెప్పుకున్నాం తోడీసింగు క్యావెంటరు కంపెనీకి క్రీం సరఫరా చేసే ఏకైక వ్యక్తి అని. బాబావద్దకు డెహరాడూన్ వచ్చేముందు తనపని అపుచేసి తనకు కంపెనీవారు వప్పగించిన పదవికి రాజీనామా యిచ్చాడు. అందుచేత క్యావెంటరు కంపెనీవారు, వెంటనే మరో వ్యక్తి దొరకనందున, తమ ఫ్యాక్టరీలో వెన్న తయారీ మానుకోవలసి వచ్చింది. ఫ్యాక్టరీ పని చేయుటకు చాలినంత క్రీము లభ్యం కానందున అది మూతపడవలసి వచ్చింది. ఫలితంగా తోడీసింగు, బాబావద్దనుండి తన కుటుంబంతో యింటికి చేరినప్పుడు, క్రీం వ్యాపారం చేసే అవకాశం మృగ్యమైంది.

అలీఘర్‌లోనే తన కుటుంబంతో ఒక చిన్న హోటలు ప్రారంభించాడు. అలా చేయుటలో బాబా ఏదో ఒక రోజున యేదో రూపంలో తన ఇంటికి తప్పక వస్తారని ఆశించాడు. అలా ఆ వంట యింటిని, డెహరాడూన్ నుండి బాబా పంపివేసిన లగాయతూ ప్రారంభించి, తోడీసింగు మరణించేవరకూ నడిపాడు. తన అంత్య ఘడియలవరకూ బాబా సేవలో నిమగ్నమైనాడు. తాను నడుపుతున్న వంట యింటికి ఎవరు వచ్చినా ఉచితంగా భోజనం పెట్టి పంపేవాడు. ఎందరు వచ్చినా లేదనక అందరికీ సంతృప్తిగా భోజనం పెట్టి పంపేవాడు.

అతడు నిజంగా పవిత్ర మూర్తి. బాబా ప్రేమికుల మధ్య "బాబా జనామే" అనే పేరుతో ప్రసిద్ధి పొందాడు. బాబా జనామే అంటే, బాబా ఎరుగును అని అర్థం. మనమేమి అడిగినా సరే అతడు నిర్ద్వంద్వంగా బాబా జనామే అనేవాడు. "తోడ్ సింగ్! ఎందుకు నీవిలా పిచ్చివానిలా ప్రవర్తిస్తున్నావు?" అని అడిగితే "బాబాకే తెలుసు" అనేవాడు. ఎప్పుడూ, ప్రతిదానికీ, అతని జవాబు "బాబాకు తెలుసు" అని. చివరి సంవత్సరాలలో ఇలా చెప్పుటలో అతని ప్రవర్తన విచిత్రంగా మారింది. "బాబా జనామే" అంటూ తనచుట్టూ తాను తిరుగుతూ, నృత్యం చేసేవాడు.

చివరకు బాబాను స్మరిస్తూ, తన శరీరాన్ని త్యజించి, బాబాలో ఐక్యమైనాడు. సహజంగా అతనిదొక సంపన్న కుటుంబం, అయితే అతడు మరణించేనాటికి వారు కటిక పేదవారైనారు. బాబా దయవలన, అతని కుమారుడు, కుమార్తెల వివాహాలు వైభవంగానే జరిగాయి. అతడు కడు బీదరికంలో మరణించినా, మొత్తం అలీఘర్ పట్టణవాసులంతా ఆయన గొప్పదనాన్ని, ఉదారత్వాన్ని గౌరవంతో ఎంతగానో కొనియాడారు.

## ఆర్తుల ఆదరణ

డెహరాడూన్ స్టేషను నుండి సరాసరి మంజరీ మాఫీకి బాబా బృందం బయలుదేరింది. కానీ వారికొరకు క్రొత్తగా కడుతున్న పర్ణశాలలు యింకా పూర్తికానందున, ముందుగా బాబా

తన మిత్రులు వెంటరాగా, మిసెస్ ఫ్రాటు బంగళాలో రెండు రోజు లాగారు. యిది నజీబాబాదులోని తోటవలె కాక, చక్కని బంగళా. వరుసలతో నాటిన గులాబీల గుబాళింపు, సూర్య కాంతిలో ప్రజ్వరిల్లే రకరకాల పూ పొదలతో శోభాయమానంగా, చూడ ముచ్చటేసింది.

మంచుతో కప్పబడిన ముస్సోరీ కొండలు, చక్కని దృశ్యంలా కనపడినై. బంగళా లోపల అన్ని సదుపాయాలు వున్నాయి. వంట గదిలో ఎలక్ట్రిక్ స్టౌ వుంది. వేన్నీళ్ళు ఎప్పుడు కావాలన్నా కాచుకోవచ్చును అనుకున్నారు ఆడవాళ్ళు. ఆ బంగళాలో ఒక ప్రక్కన యాంటిలో అనే మిలటరీ సర్వీసులో రిటైరైన అధికారి, భార్యతో ఉంటున్నారు. రెండవ ప్రపంచ సంగ్రామంలో తన యిరువురు కుమారులను పోగొట్టుకున్న దుర దృష్ట వంతులు వారు.

దానికితోడు యాంటిలో కంటి జబ్బుతో బాధపడి, వ్యాధి నిర్మూలన కవసరమగు వైద్యం చేయించుకోలేక దృష్టి కోల్పో యాడు. స్వదేశమైన ఇంగ్లండు పోవుటకు తగు పైకం లేక పరితపిస్తున్నారు. బాబా తన మిత్రు లొకరిని వారివద్దకు పంపారు. యాంటిలో సంభాషణలో, తమ బాధనంతా చెప్పు కున్నాడు. ఆవిషయం తెలిసిన బాబా డా॥ డాన్‌కిన్‌ద్వారా వారు ఇంగ్లండు వెళ్ళుటకు అవుసరమగు పైకం పంపారు.

ఎన్ని జన్మల నుంచియో యాంటిలోకు బాబాతో సంబంధం వున్నరీత్యా, ఫ్రాట్ బంగళాలోఆగి, ఆర్థిక సహాయం చేసి,

స్వదేశం చేరు ఏర్పాటు చేశారోకదా! అందుకే బాబా కార్య కర్మిమాల్లో వూహించని మార్పులు అనేక పర్యాయాలు జరగటం, తద్వారా అధ్యాత్మికమైన పరిణామము లేవో జరిగిపోవటం, అనేక సంఘటనల్లో గమనించవచ్చును.

అదినవజీవనం కానీ, పూర్వజీవనం కానీ, తనకు సన్నిహితులైన వారిని తన చెంతకు, ప్రేమద్వారా ఎలా ఆకర్షించేవారో, యీ ఉదంతాలన్నీ మనకు బోధిస్తాయి. హృదయంలో హత్తుకుపోయే యిలాంటి సంఘటనలు, బాబా నవజీవనంలోనే కాక, నవజీవనంలో ధరించిన సర్దా వదిలింతర్వాత కూడ అనేకం జరుగుతూనే ఉన్నాయి. మిసెస్ ఫ్రెటు బంగళాలో జరిగిన మేజరు మాంటిలోగారి సంఘటన, తోడీసింగుగారి ఉదంతం మరువరాని సంఘటనలు.

o O o

— రెండవ భాగం సమాప్తము



With the best wishes on the occasion of **"GRUHAPRAVESAM"** of Sri Kanyakaparameswari Rice Mill New Building Annexe by the Grace of Avatar Meher Baba



మెహెర్ బాబా ట్రేడర్స్
మచిలీపట్నం

మేనేజింగ్ పార్టనర్స్ :
కొల్లిపర వరాహ వరశింహమూర్తి
తాడేపల్లి బసవయ్య
గుడివాడ రామచంద్రరావు



